సంజీవరావు, మొసలికంటి

# బక్సారు యుద్ధము

Vizag, 1925

Record no. 176

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

సంజీవరావు, మొసలికంటి.

బక్సారు యుద్ధము / గ్రంథకర్త మొసలికంటి సంజీవరావు.- Vizag : V. R. C. Press, 1925.

ii, ii, 2, (2), 2, 73, 2p. ;17 cm.

Record no. 176

Sañjīvarāvu, Mosalikaṇṭi.

Baksāru Yuddhamu / granthakarta Mosalikaṇṭi Sañjīvarāvu.-Vizag : V. R. C. Press, 1925.

ii, ii, 2, (2), 2, 73, 2p. ;17 cm.

Record no. 176

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB Date filming began:

ఆంధ్ర సంజీవినీ గ్రంథమాల 5.

సంపాదకుఁడు,

మొసలికంటి సంజీవరావు.

3576

# బక్సారు యుద్ధము

( ఆంగ్లేయులు బంగాళాదేశమును జయించిన కథ. )

## BATTLE OF BUXAR

with a foreward by

**Prof. M. VENKATARANGAYYA.** M. A.,

*Maharaja's College, Vizianugram.*

గ్రంథకర్త:

మొసలికంటి సంజీవరావు,

విశాఖపట్టణము.

సర్వస్వామ్యసంకలితము.] [వెల **0-10-0.**

PRINTED AT THE V. R. C. PRESS, VIZAG.

1925.

# ఆంధ్ర సంజీవినీ గ్రంథమాల.

సంస్థాపకులు: (1) కీ. శే. గుమ్మా శ్రీరామకవి.

(2) శ్రీయుత గుమ్మా సన్యాసిరాజకవి.

(నరసీపట్టణము)

## పోషకులు

(1) మ॥ రా॥ రా॥ మొసలికంటి కామేశ్వరరావు పంతులగారు, జోయింటు ప్రొప్రయిటరు, అల్లిపురము ఎస్టేటు, విశాఖపట్టణము.

(2) ,, వేపా విజయరామమూర్తి పంతులుగారు, బి. ఏ. బి. ఎల్. విశాఖపట్టణము.

(3) ఆకెళ్ల సూర్యనారాయణరావు పంతులుగారు, బి. ఎస్‌సి. విశాఖపట్టణము.

## పీఠిక.

ఆంగ్లేయ సామ్రాజ్యము మనదేశమందు వ్యాప్తిగాంచిన విధమును గుఱించి గ్రంథకర్త వ్రాయనుద్దేశించిన గ్రంథములలో "బక్సారు" యుద్ధమను నీపుస్తకము రెండవది. ఇందు "ప్లాసీ" యుద్ధము మొదలు "బక్సారు" యుద్ధము వరకు జరిగిన విషయము లన్నియు సమగ్రముగ వర్ణింపబడి యున్నవి. ఈరెండు యుద్ధములకు మధ్య జరిగిన చరిత్ర చాల ముఖ్యమైనది. ప్లాసీయుద్ధము మూలమున ఆంగ్లేయులకు రాజ్యసంపద లభించెను; బక్సారు యుద్ధము మూలమున అది వారికి స్థిరపడెను. ఇట్లు స్థిరపడుటకు పూర్వము మీర్జాఫరు మీర్కాసీం అను బంగాళా నవాబు లిద్దరు అధికారమునుండి ఇంగ్లీషువారిని తొలగించుటకనేక ప్రయత్నములు గావించిరి. మీర్జాఫరు చేసిన ప్రయత్నము లన్నియు రహస్యములయినవి. బుద్ధికుశలుడగు క్లయివు ఈ రహస్యకుట్రలనన్నిటిని తెలుసుకొని వాటివలన ప్రమాదము కలుగకుండ ఆంగ్లేయుల అధికారమును కాపాడెను. మీర్కాసీం సైన్యములను తయారుచేసి బహిరంగముగ ఇంగ్లీషువారిపై యుద్ధము చేసెను. ఈ యుద్ధములో అతనికి అయోధ్య నవాబు షాఅలం చక్రవర్తియు సహాయము చేసిరి. కాని, ఇంగ్లీషు సేనానులు శక్తిసామర్థ్యముల గలవారగుటచే నతనికి జయము రాకపోయెను. బక్సారు యుద్ధమందతడు సంపూర్ణమగు నపజయమును పొందుటచే బంగాళా రాజ్య మాంగ్లేయులు

వశము చేసుకొనగలిగిరి. అది మొదలు బంగాళమందు ఇంగ్లీషు వారి నెదిరింప గలవారెవ్వరు లేరైరి. అసమాన్యమగు ధనధాన్య సమృద్ధిగల నీ రాష్ట్రము వారి స్వాధీనమైన కారణమున మనదేశములోని తక్కిన భాగములను కూడ వారు సులభముగ జయింప గలిగిరి.

ఈ పై విషయములనన్నిటిని గ్రంథకర్త విపులముగ వివరించి యున్నారు. వారి అభిప్రాయముల నన్నిటిని సహేతుకముగ నిరూపించిరి. మీర్కాసీమునకును ఇంగ్లీషువారికిని జరిగిన యుద్ధములలో నిరుపక్షములవారెట్లు ప్రవర్తించిరో, ఏ సందర్భములు ఇంగ్లీషు వారి కనుకూలించినవో, మీర్కాసీమునకు ప్రతికూలించిన సందర్భము లేవియో గ్రంథమందు స్పష్టపరుపబడియున్నవి. గ్రంథకర్త యొక్క శైలి సరళముగను పటుత్వము గలిగియున్నది. ఈ పుస్తకము సామాన్య జనులకే గాక విశ్వవిద్యాలయ పరీక్షలకు చదువు విద్యార్థులకు కూడ ఉపయోగించ గలదు.

మహారాజా కాలేజి
విజయనగరం
18-3-25

మామిడిపూడి వెంకటరంగయ్య.

# An appreciation.

This booklet on the "Battle of Buxar" covers in detail the history of Bengal trom Plassey to Buxar. The ascendency of the Company to supreme power in the province is the central theme. It is clear from the author's treatment of the subject that the company owed their rise to their superior military organisation, their command of the sea, and their intrusive pushing qualities as traders. From the position of interfering merchants they easily assumed the role of Nabob-makers in Bengal and final arbiters of the relations between the Padshah and his subordinates. The greedy grasp of unjust wealth by the Company's servants detrimental to the interests of even their masters was possible, it is shown, as there was no strong Government in Bengal between 1757 and 1765 in which latter year the Directors took into their hands the responsibility of administration of territory.

The large number of instructive and convincing similes, and the graphic description of the batte-fields, especially of the fortress of 'Undwanala,' are commendable features of the work. Finally we feel that the

grant of the Diwani right to the company was but a recognition by the men in power in the Imperial Court at Delhi of the 'de facto' ownership of Bengal, Bihar and Orissa won by the English with their successful fighting at Gheria and Buxar. Two functions the author performs in his pages—gives information to, and provokes the thought of the reader. College students are sure to be benefitted by it.

Mrs. A. V. N. College,
Vizagapatam,
26-3-25.

(Sd). N. Rangaswami
Lect. in History.

# A Critical Opinion.

I have read the two booklets **'Plassey'** and **'Buxar'** by Mr. Sanjivarao. Dealing as they do, with the portion which is most unique in the History of Modern India in particular, of which every Indian ought to know, and of which every Englishman may very well be proud of, nay- in the History of the whole world, as the conquest of a vast Empire by a mere mercantile Body is nowhere to be found, the author has chosen a fertile field, and consulting the various 'Source books' on the topic, did full justice to the magnitude of the Subject. As a chapter in the History of India, the two essays are commendable.

The author's **adherence to truth** at all costs is the chief trait of both the books. The passages dealing with the conqueror's military strategy are well counter-balanced by his mean tactics as a mercantile body. The medieval art of Govt. typified in the Mohammadan rulers of the Province revealing their inherent weakness and instability, thus making them the victims of circumstances was equally portrayed with their good qualities to better their position as well as that of the people, with rigour and lucidity which may not be palatable to the conquerors or the conquered in some places. The author's fearless exposition can fully be justified by his adherence to truth.

As a chapter in the Art of warfare the subject lends itself so well, that the author has fully grasped all the various details to depict the medieval art of

warfare and the Modern, and also showed forth where the inherent weakness of the Continental generals lay as opposed to the inherent superiority of the Britisher which ultimately made him the ruler of the world.

The author has shown to us not mere names as is often possible in works of History, but has created real characters which appeal to the reader as he proceeds. The difficulties which prompted the various Generals and Council Members to Act as they did, as also the different situations into which the Mahamodan puppets were placed and from which they tried to extricate themselves by the different processes to which they ultimately succumbed are carefully described, and this comic element is peculiar to the essays in question.

As a piece of literature also. I make bold to say that they are written in a lucid, masterly style well suited to the subject. The auother has shown good command of the language and described the various strategic situations graphically.

I therefore, think that the two essays are befitting the unique subject which reveals the Merchant, Conqueror, and the Ruler in one and the same, as also the gradual transition from one to the other. I commend the same to all lovers of History in particular, and to all lovers of Telugu Literature in general as interesting pieces of Historical Essays of the Macaulay School with truthfulness superadded thereon.

Vizagapatam, } (Sd.) G. KRISHNAMURTI, M. A., B. L.,
9-4-25 } *High Court Vakil,*

ఆంధ్ర సంజీవినీ గ్రంథమాల

ప్రత్యేక ముద్రణాలయము లేని కారణమున ఈ "బక్సారు యుద్ధ" మింతవఱకును ప్రచురమగుటకు నవకాశము లేకపోయెను. మాచందాదారులు క్షమియింతురుగాక.

మా "ప్లాసీయుద్ధము" నందుకొని మాకు రూ 10 విరాళముగా బంపిన మ॥ రా॥ రా॥ వైజస్సు గోవిందరావు పంతులు గారికి (రాజమహేంద్రవరము) కృతజ్ఞతాపూర్వకముగా వందనము లర్పించుచున్నాము.

సంపాదకుఁడు

## ఆంధ్రసంజీవనీ గ్రంథమాల.

(1) 0-4-0 ప్రవేశ రుసుము చెల్లించి, పేరు నమోదు చేయించుకొని, మేము ప్రచురించు గ్రంథముల నన్నింటిని గొనువారు శాశ్వతపు చందాదారులు.

(2) సంవత్సరమునకు నాలుగైదు గ్రంథములు వెలువడును.

(3) మా గ్రంథములన్నియు చౌకధరల కొసంగఁబడును.

(4) మా చందాదారులకు మా గ్రంథములన్నియు తగ్గింపు ధరల కొసంగఁబడును.

(5) 'పోస్టు, వీ పీ' వగైరా ఖర్చులను చందాదారులే భరింపవలయును.

(6) సంవత్సరమునకు రు 3 లు ముందుగా చెల్లించువారి 'పోస్టు, వీ పీ' వగైరాఖర్చులను మేమే భరించి గ్రంథములను బంపెదము. గ్రంథముల ఖరీదు కూడ వేఱుగా నొసంగ నక్కఱ లేదు.

(7) సంవత్సరమునకు రూ 25 లు ముందుగా చెల్లించువారు పోషకులుగా గణింపఁబడుదురు. మా గ్రంథములన్నియు వారికి నుచితముగ నొసంగఁబడును.

(8) సంవత్సరమునకు రూ 100 లు ముందుగా చెల్లించువారు రాజపోషకులుగా గణింపఁబడుదురు.

---

## ఉపోద్ఘాతము.

ప్లాసీ యుద్ధమున " ప్రారంభమైన " ఆంగ్లేయులు బంగాళాదేశమును జయించిన కథ " యిందు పూర్తియైనది.

ఈ " బక్సారు యుద్ధము " నాలుగు ప్రకరణములుగ విభజింపబడి యున్నది.

ప్లాసీయుద్ధమున జయించిన ఆంగ్లేయుల సాహాయ్యముచే మీర్జాఫరు సింహాసనారూఢుఁడైన విషయమును పాఠకులెఱింగియే యుందురు. అనేక కారణములచే మీర్జాఫరు, ప్రజాకంటకుఁడాయెను: రాజ్యమును పరిపాలింపనేరనివాఁడాయెను: తన యధికారమును ధిక్కరించిన రాష్ట్రాధిపతుల నడంపఁజాలని వాఁడాయెను: తన దేశముపై దండెత్తిన వైరులను మార్కొనఁజాలనివాఁడు కూడ నాయెను. అడుగడుగునకు నాంగ్లేయుల సాహాయ్యమే యవసరమగుచుండుటచే, మీర్జాఫరు యొక్క దౌర్బల్య మధిక మగుటయు, ఆంగ్లేయుల యధికార మధికమగుటయును సంభవించెను. తుదకు, ఆంగ్లేయుల సాహాయ్యముచే రాజ్యాధిపతియైన మీర్జాఫరు ఆంగ్లేయులచేతనే రాజ్యభ్రష్టుఁడాయెను. అతని యల్లుఁడగు మీర్ కాశిము, ఆంగ్లేయు లామోదింప సింహాసనారూఢుఁడాయెను. ఈ విషయములును తదితర విషయములును మొదటి ప్రకరణమున వర్ణింపబడియున్నవి.

మీర్కాసీము రాజ్యాధిపతియైన పిమ్మట ఎట్టి పరిస్థితు లేర్పడెనో, యేయే కారణములచే నాతనికిని ఆంగ్లేయులకును వైరము సంభవించెనో రెండవ ప్రకరణమున వర్ణింపబడియున్నవి. ఆంగ్లకంపెనీసేవకులు దైశికవర్తకమున పాల్గొనుటచే నేర్పడిన యరాజకము గమనింపదగి యున్నది.

మీర్కాసీమునకును ఆంగ్లేయులకును జరిగిన యుద్ధములు మూడవ ప్రకరణమున వర్ణింపబడియున్నవి. బి. ఏ. క్లాసు వారికి పఠనీయగ్రంథముగ నున్న హిందూదేశ చరిత్రయం దీయుద్ధములు కానరావు: ఒక్క బక్సారు యుద్ధము మాత్రము ఒక్క చిన్న

పేరాలో గోచరించును. తన యసాధారణ పాండిత్యమును వ్యక్తపఱచిన "మిల్లు" సహితము ఈ యుద్ధములను సరిగా వర్ణింపలేదు. "మాలిసన్" యను చరిత్రకారుఁడు మాత్రము వీనిని విపులముగా వర్ణించియున్నాడు ("Decisive Battles" — Malleson.) ముఖ్యముగా వాని ననుసరించియే నేను వ్రాసితిని. గ్రంథమున నుదహరించిన కారణములచే నీ యుద్ధములందు మీర్కాసీము పరాజితుఁడాయెను.

మీర్కాసీమునకు సాహాయ్యమొనరింప బోయిన అయోధ్యాధిపతియు మొగలాయి పాదుషాయు గూడ పూర్తిగ నోటువడిరి. అట్టి మహావిజయములను గాంచిన ఆంగ్లేయుల నెవ్వరు నడ్డగింపఁజాలరైరి. బంగాళాబీహారు ఒరిస్సాదేశముల రాజ్యాధిపత్యమును వారు బహిరంగముగా వహించిరను, నిరోధించువా రెవ్వరు లేరు. ఐనను, గ్రంథమున నుదహరించిన కారణములచే నట్టు లొనరింపక ఓటు వడిన పాదుషావద్ద 'దివానీ' యధికారమును గ్రహించి, పేరున కొక నబాబును సింహాసనముపై నిలిపి, ఆంగ్లేయులు రాజ్యాధికారముల ననుభవింప దొడంగిరి. ఆంగ్లేయులు బంగాళాదేశమును జయించిన కథ పూర్తియైనది

ఈ గ్రంథమునకు గూడ పీఠిక వ్రాసి యొసంగిన శ్రీయుత మా॥ వేంకట రంగయ్యగారును, (M. A., Maharaja's College, Vizianagram) తమ యభిప్రాయములను వ్రాసి యొసంగిన శ్రీయుత ఎన్. రంగస్వామి అయ్యరు గారును, (M. A. Mrs. A. V. N. Collge, Vizagapatam) శ్రీయుత గరిమెళ్ల కృష్ణమూర్తి పంతులుగారును (M. A. B. L, High Court Vakil, Vizagapatam) నేను కోరిన సాహాయ్యము నొనరించిన శ్రీయుత సుంకరి పార్థసారథి నాయుడుగారును (M. A. L. T, Mrs. A. V. N. Collge, Vizagapatam) నా కెంతయు వందనీయులు.

విశాఖపట్టణము, } మొసలికంటి సంజీవరావు.

# బక్సారు యుద్ధము.

## మీర్జాఫరు.

హైందవచారిత్రమునందు ప్లాసీయుద్ధము మిక్కిలి ప్రధానమైనది. అయ్యది హైందవ స్వాతంత్ర్య మంతరించుటకుఁ గారణముగఁ బరిణమించెను. ఆదిమధ్యాంతరహితమగు భారతచారిత్రమున నొక నూతనయుగము ప్రారంభమగుటకు నయ్యది కారణ భూతమాయెను. తొల్లి, స్థానేశ్వర యుద్ధము మహమ్మదీయ విజృంభణమునకు నెట్లు దారిజూపెనో, అట్లే ఆంగ్లేయ విజృంభణమునకీ ప్లాసీయుద్ధము మార్గదర్శి యాయెను.

కాని, అంతవఱకును కేవలము వర్తకులవలె సంచరించుచు లాభ మార్జించుచుండిన ఆంగ్లేయులు మాయోపాయముచే ప్లాసీయుద్ధమున విజయులైనంతమాత్రమున బంగాళా బీహారు ఒరిస్సాదేశములు వారి యధీనము కాలేదు. ఆంగ్లేయు లెంతటి యాశాపరులైనను, ఎంతటి సాహసవంతులైనను, ఎంతటి యుపాయ ధురీణులైనను, తోడనే యాదేశములను స్వాధీనపఱచికొను నాసక్తిగాని సామర్థ్యముకాని వారి కాసమయమున లేదు. * అలివర్దీఖాను వంటి రాజనీతి విశారదుఁడును రణవ్యాపారపారాయణుడును ఆ సమయమున రాజ్యాధిపతియై యుండెనేని, ఆంగ్లేయులను నొక్కియుంచుటకును దైశిక స్వాతంత్ర్యమును నిలువబెట్టుటకును నవకా

* Cf.— "Although they were conquerors defacto, they neither could nor would assume the attitude of rulers dejure;..."—Lyall's British Dominion in India, p. 142.

లు తత్కారణమున లభించిన ధనముతో తప్పద్రావి, మైమఱచి, దుర్వ్యసనము లధికములగుటచే వారిలో బెక్కండ్రు మరణించుచుండ, * తనసైనికులకొసంగుట కొక్క కాసైనను మీర్జాఫరునకు లేదాయెను. ఇదారు మాసములనుండియు వారికి జీతబత్తెములు సరిగా ముట్టుటలేదు. తమ యేలిక రాజ్యాధిపతియైనంతనే తమ దారిద్ర్యము తీఱిపోవునని వారాసించియుండ, నిలువయుండిన ధనమును ఆంగ్లవిహంగములు తన్నుకొని పోయెను. ఆకారణమున సైనికుల దురవస్థ మఱింత దుర్భరమాయెను. వారిని శాంతపఱచుట మీర్జాఫరునకు ప్రధాన కర్తవ్యమాయెను.

కాఁబట్టి, ధనసంగ్రహము మీర్జాఫరునకు నవశ్యకమాయెను. కాని, అతఁడు రాజనీతిజ్ఞుఁడును పరిపాలనా ధురంధరుఁడును ఆర్థిక శాస్త్రకోవిదుఁడును కాఁడాయెను. కరవాలమును గైకొని శత్రుసైన్యముల నురుమాడుటకును, పరదేశాగతులగు నాంగ్లేయులతో గుట్రలు నలిపి స్వామిద్రోహము నొనరించుటకు మాత్రమే యాతఁడు చాలియుండెను. అట్టి మీర్జాఫరు ఎట్టులైనను ధనము సంగ్రహింపవలయునని సమకట్టి మఱింత ప్రజాకంటకుఁడాయెను, దేశమును మఱింత నికృష్టదశకుఁ దెచ్చిన వాఁడాయెను.

మీర్జాఫరునకు ద్రోహబుద్ధి సహజగుణమైనట్లు కాన్పించుచున్నది. సురాజదౌలాను రాజ్యభ్రష్టు నొనరించు సందర్భముననే గాక, ఇతర సమయములందు గూడ మీర్జాఫరునకు 'రోయిదులుబు' అనేక తెఱఁగుల సహకారియు నుపకారియునై యుండెను. అట్టి పురుషునితో సఖ్యముగ నుండి, అట్టి యనుభవజ్ఞుని సాహాయ్యము వడసి వలయు రాజ్యాంగ సంస్కరణముల నొనరించి, దేశమున శాంతి నెలకొల్పి, ఆర్థిక పరిస్థితులను చక్కఁబఱచికొనుటకు మాఱుగ, మీర్జాఫరు మూర్ఖుఁడై అతని ధనము నెట్టులైన నపహరింపవలయునని సంకల్పించి అతని నెట్టులైనను వంచింపవలయునని నిశ్చయించెను. మతద్వేషముకూడ నొక కారణమై యుండునని చరిత్రకారుఁడగు మిల్లు వ్రాసియున్నాఁడు. కాని, 'రోయిదులుబ్' ఆంగ్లపక్షపాతి యని యెంచి మీర్జాఫరాతనిపై గుపితుఁడై యుండియుండవచ్చునని యనుమానించుటకు హెచ్చు అవకాశమున్నది. ఏమైనను, విశ్వాసఘాతకుఁడగు మీర్జాఫరుయొక్కయు, దుర్మార్గుఁడగు మీరాన్ యొక్కయు గుట్రలను భరింపఁజాలక, ఆంగ్లేయుల సాహాయ్యము వడసి 'రోయిదులుబు' కలకత్తానగరమునకు నిర్గమింపవలసిన వాఁడాయెను.

మీర్జాఫరుయొక్క దౌర్బల్యమును అవివేక ప్రవర్తనమును గాంచుచుండిన రాష్ట్రాధిపతులాతని యధికారమును ధిక్కరింప నారంభించిరి. ఎద్దియో విధమున వారిని లోఁబఱచికొని దేశమున శాంతి నెలకొల్పుట ప్రధానకర్తవ్య మాయెను. వారిపై దండెత్తి వారిని లోఁబఱచికొనవలయునని మీర్జాఫరు సంకల్పించెను. తన సైన్యముల నాతఁడు పూర్తిగ విశ్వసింపఁజాలని వాఁడగుటచే, నాతనికి నాంగ్లసైన్య సాహాయ్య మవసరమాయెను. ఆ కారణమున, తన సైన్యములతోఁబాటు ఆంగ్లసైన్యములను గూడ వెంటనిడికొని, బీహారు రాష్ట్రాధిపతియగు రామనారాయణునిపై దండెత్తుటకు నాతఁడు బయల్వెడలెను.

దుర్బలుఁడగు మీర్జాఫరు శ్లేష్మములోఁబడిన యీఁగవలె గొ

* Cf......his troops, with the prize-money distributed among them in consequence of the battle of Plassey, had indulged in such intemperance, that many of the Europeans had died......" Mill—Vol, III, p. 270.

ట్టుకొనుచుండ, సూక్ష్మబుద్ధియగు క్లైవు పరిస్థితులను జక్కఁగఁ బరిశీలించుచుండెను. తన సాహాయ్యము లేకుండ మీర్జాఫరు ముందంజ వేయఁజాలఁడని యాతఁడు గుర్తించెను. మీర్జాఫరును బీడించి మఱింత ధనమును సంగ్రహించుట కదియే తరుణమని క్లైవు యోచించెను.* అట్లు యోచించి, తనకింకను 23 లక్షల రూపాయిలు చెల్లవలసి యుండెననియు, పైకమును తక్షణము చెల్లించినగాని తాను అడుగు వేయువాఁడను గాననియును కఠినముగ నాతఁడు నబాబున కెఱింగించెను. సుప్రసిద్ధుఁడగు నక్షత్రకునివలె సంచరించుచుండిన క్లైవును మీర్జాఫరు వారింపఁజాలఁడాయెను. బీహారు రాష్ట్రాధిపతిని దండింపఁగోరిన మీర్జాఫరునకు క్లైవును సంతృప్తిపఱచుట మిక్కిలి యవసరమై యుండెను. మూర్షిదాబాదునందలి కోశాగారమున సగము పైకము మాత్రముండెను. కాని, క్లైవు సగము సగములతో సంతసించువాఁడు కాఁడు. కాఁబట్టి, ఆ సగము పైకమును వ్రాసియిచ్చి, మిగిలిన పైకముక్రింద కొన్నిజిల్లాల శిస్తులనుగూడ శాస్త్రసమ్మతముగ వ్రాసి నబాబు సమర్పింప, † క్లైవు సంతుష్టాంతరంగుఁడాయెను.

కాఠిన్యము వహించి యెట్టులైనను ధనమును సంగ్రహింపవలయునని మాత్రమే క్లైవు యోచించెను గాని, మీర్జాఫరునకు ను

* Cf. "Clive perceived his opportunity; and refused to proceed with him, unless all the sums due upon the agreements with the English were previously discharged". Mill—Vol. III, p. 272.

† "Orders were signed upon the treasury for one half; and tuncaws, that is, orders to the local receivers to make payment out of the revenues as they come in, were granted on certain districts for the remainder." Mill—Vol. III p. 273.



పకార మొనరింపవలయునని భావింపలేదు. కార్యము నెఱవేరినపిమ్మట, ఎద్దియో నెపమున వెనుకకు మఱల వలయునని అయ్యాంగ్లనాయకుఁడు యోచించెను. బీహారు రాష్ట్రాధిపతియగు రామనారాయణుఁడు మిక్కిలి బలవంతుఁడనియు, ఆతనికి నయోధ్యాదేశాధిపతియును మహారాష్ట్రులును గూడ దోడ్పడుదురేని, ఆతనిని జయించుట మిక్కిలి కష్టతరమగుననియును నిరూపించి, రామనారాయణునితో సంధి గావింతునని మీర్జాఫరునకు నాంగ్లేయమహావీరుఁ డెఱింగించెను. సర్వజ్ఞుఁడగు క్లైవు శాసించునపుడు అల్పజ్ఞుఁడగు మీర్జాఫరేమిచేయఁగలఁడు? ఫ్రెంచిసైనికులయొక్కయు మహారాష్ట్రులయొక్కయు సాహాయ్యము వడసి అయోధ్యాదేశాధిపతి యరుదేరనుండెనని కూడ నాసమయముననే తెలియవచ్చెను. అంతియేగాక, మహారాష్ట్రనాయకుఁ డొకఁడు నిజముగ నరుదెంచి, తమకుఁ జెల్లవలసియుండిన 24 లక్షల రూపాయిల 'చౌతు'ను జెల్లింపవలయునని కోరెను. పరిస్థితు లటులుండుటచే, క్లైవు చెప్పిన చొప్పున ప్రవర్తించుట తప్ప మీర్జాఫరునకు మార్గాంతరము కానరాకుండెను. కాఁబట్టి, ఆతనికిని రామనారాయణునకును నెద్దియో సంధి కుదిరెను.

కాని, వారిరువురకు సంధికుదురునంతమాత్రమున స్వలాభప్రియుఁడగు క్లైవునకు గలుగు లాభమేమి? అయ్యాంగ్లవర్తకశిఖామణి యెద్దియైన లాభమును సంగ్రహించినగాని సంతసించువాఁడు కాఁడు. కాఠిన్యము వహించి మీర్జాఫరును బీడించి, మాఱుమాటాడుటకైనను నాతనికి నవకాశ మొసంగక 23 లక్షల రూపాయిలను సంగ్రహించినను, క్లైవు సంతసింపఁడాయెను. నబాబు అట్లు యసహా

యుఁడై యుండినపుడే, ఆతనివలన మహత్తర లాభము నొందు గ్రహింపవలయునని స్వార్థపరుఁడగు క్లైవు నిర్దయుఁడై నిశ్చయించెను*. ఆ ప్రాంతమున సురేకారవ్యాపారము మిక్కిలి లాభకరముగ నుండెను. ఆ వ్యాపారము వలని లాభము క్రమముగా వేయి మడుంగు లధికమగునని క్లైవు గుర్తించెను. తోడనే, ఆతని దృష్టి ఆ వ్యాపారముపైఁ బాఱెను. కాఁబట్టి, ఆ సురేకారవ్యాపారమును శాశ్వతముగను పూర్తిగను దమ యధీనము చేయవలయునని యాతఁడు కోరెను. అందుకు ప్రతిఫలముగ నబాబున కాతఁడు మిక్కిలి లాభకరమగు షరతులను బ్రదర్శించెను. కాని, క్లైవుయొక్క యాడంబరము గాంచి మీర్జాఫరు భ్రమించు కాలము మీఱియుండెను: క్లైవుయొక్కయు నాటి ఆంగ్లేయకంపెనీ సేవకులయొక్కయు విశ్వాసఘాతకనైజము నాతఁడు క్రమముగా నరయుచుండెను. ఆకారణమున నాతఁడా వ్యాపారమును వారి యధీనము చేయరాదని యోచించెను.† కాని, ఆతఁడెంత ప్రయత్నించినను కార్యము లేకపోయెను. కార్యముపట్ల క్లైవు మోమాటము పడువాఁడు కాఁడు. ఆతఁడు దయారహితుఁడై కాఠిన్యము వహించి యుండుటచే, దుర్బలుఁడగు మీర్జాఫరు ఇయ్యకొనవలసినవాఁడాయెను.

ఆ తెఱంగున నబాబును పీడించి, 1758 మే 15 వ తారీఖున

* Cf:— "He even extorted from him another grant, of no small importance to the English treasury"—Mill—Vol. III, p. 274.

† ...... "but the Nabob knew that he could not demand from the English the regular presents which he could derive from a renter placed at his mercy; he was not therefore inclined to the arrangement; but after a variety of objections the necessity of his circumstances, compelled him to comply"—Mill—Vol. III, p. 274.



క్లైవు ముర్షిదాబాదు నగరమునకుఁ బోయెను. నబాబు రాజధానికే తెచ్చు వఱకునైన నిలిచి యుండక, 24 తారీఖున బయలుదేఱి, యాతఁడు కలకత్తానగరమునకుఁ బ్రయాణమాయెను.

ఆ సమయమున కర్ణాటకదేశమున నాంగ్లేయుల స్థితి కడు ప్రమాదకరముగ నుండెను. ఆంగ్లేయులవలెనే ఆశాపరవశులై యుండిన ఫ్రెంచివారు తమ శత్రువులగు నాంగ్లేయులను నిర్మూలమొనరించి రాజ్యాధికారములను చేఁజిక్కించుకొనవలయునని సమకట్టిరి. ఆ కారణమున నాంగ్లేయుల స్థితి కడుప్రమాదకరముగనుండుటచే, సైన్యములను వెంటబెట్టుకొని వెంటనే రావలయునని క్లైవునకు వారు వర్తమానమంపిరి. ఆతఁడు నిజముగా చెన్నపురి ఆంగ్లప్రభుత్వవర్గమునొక్క సేవకుఁడై యుండెను. బంగాళాదేశమునందలి సురాజదౌలాయొక్క ధాకకు తాళఁజాలక పలాయన మొనరించిన తోడి ఆంగ్లసేవకుల సాహాయ్యార్థము క్లయివుయును వాట్సనుయును నియోగింపఁబడిన విషయమును పాఠకు లెఱింగియేయుందురు. బంగాళాదేశమున కరుదెంచిన క్లయివు ఎట్టి సాహసకార్యములచేతను ఎట్టి వక్రమార్గములచేతను సురాజదౌలాను రాజ్యభ్రష్టు నొనరించియుండెనో మద్విరచిత ప్లాసీయుద్ధమున వివరింపఁబడియున్నది. కార్యము నెఱవేరినవెంటనే అయ్యాంగ్లనాయకుఁడు తొంటిప్రదేశమునకు రావలయునని తత్ప్రభుత్వాధికారు లాజ్ఞాపించియుండిరి. అంతియేగాక, ఆ సమయమున క్లయివుయొక్క సాహాయ్యము వారికి మిక్కిలి యవసరముగ నుండెను. ఆ కారణముచే నాతని రాకకై వారు అత్యుత్సాహముతో నిరీక్షించుచుండిరి. కాని, క్లయివు యెట్లు ప్రవర్తించెనో గమనింపఁదగియున్నది. ప్లాసీయుద్ధకారణమున సురాజదౌలా విగతజీవుఁడైనంతనే, క్లయివు మహాపురుషుఁడా

యెను. అతి విశాలములును అతి సారవంతములును అగు బంగాళా బీహారు ఒరిస్సాదేశములను బరిపాలించు నబాబు ఆతనిచే బ్రతిష్ఠింపఁబడి, ఆతనికి దాసానుదాసుఁడై యుండెను. అభినవ కల్పవృక్షమువలెను, అభినవకామధేనువువలెను, నుండిన బంగాళాదేశ మాతని యధీనమై యుండెను. బంగాళాదేశమనెడు కుబేరుని కోశాగారముయొక్క బీగము ఆతని హస్తమున నుండెను. ఆతఁడట్లు మహావైభవాక్రాంతుఁడై యుండ, బంగాళాదేశము నెట్లు వీడఁగలఁడు? కాఁబట్టి, చెన్నపురిప్రభుత్వవర్గము భంగపడినను సరె, వైరులగు ఫ్రెంచవారాప్రాంతమున రాజ్యాధికారవైభవ సమన్వితులైనను సరె, తానుమాత్రము బంగాళాదేశముననే యుండవలయునని క్లయివు నిశ్చయించెను.*

ఆ సమయమున నుత్తరసర్కారులు ఫ్రెంచివారి యధీనమున నుండెను. ఉత్తరసర్కారులందలి రాజ్యాధిపతులలో నెల్ల విజయనగరరాజ్యాధిపతియగు ఆనందరాజు ప్రధానపురుషుఁడై యుండెను. ఆసమయమున, సుప్రసిద్ధ ఫ్రెంచినాయకుఁడగు బుస్సీదొర హైదరాబాదు దేశమునందలి రాజకీయవ్యవహారములందు నిమగ్నుఁడై యుండెను. అట్టి సమయమునందే, ఆంగ్లేయులను రావించి, ఫ్రెంచి సైన్యములను బాఱద్రోలి తన రాజ్యమును పెంపుఁజేయ వలయునని ఆనందరాజు యోచించెను. కాని, ఆంగ్లేయులు క్రమముగా దేశమునంతయు నాక్రమింతురనియు, తన రాజ్యమునకుఁగల స్వాతంత్ర్యమును బూర్తిగ హరించి తనను సాధారణపు జమీందారునిగా నొనరింతురనియు నా వెడంగు ఱేఁడు కలనైనఁ దలంచి

* "Clive chose to remain in Bengal, where he was the master, rather than go to Madras, where he would be under command ....."— Mill, Vol. III. P. 279.



యుండలేదు. ఆంగ్లసైన్యముల కగు ఖర్చులనెల్ల రాజుగారు భరించుటకును, రేవుస్థలములను, నదీముఖముల నుండు గ్రామములను ఆంగ్లేయులు పరిగ్రహించుటకును, వారుభయులును గలసి జయించు రాజ్యమంతయు రాజుగారికే చెందవలయుననియు వారొక సంధినిగావించి నిరి.

ఆనందరాజుయొక్క యాహ్వానము చేరినంతనే క్లయివు ఆనందపరవశుఁడాయెను. తోడనే, సైన్యసమేతుఁడై ప్రయాణమొనరించి ఆనందరాజును గలిసికొని, ఉత్తర సర్కారులను స్వాధీనపఱచికొనవలయునని కృత నిశ్చయుఁడై తన నిశ్చితాభిప్రాయము నాతఁడు తన యనుచరుల కెఱింగించెను. కాని, బంగాళాదేశమునందలి పరిస్థితు లింకను గందరగోళముగ నుండుటచే కంపెనీ సైన్యములు దేశాంతరము వెడలుట యవివేకమని యెంచి కంపెనీ సంఘ సభ్యులెల్లరు నేకగ్రీవముగా దమ యసమ్మతిని ఖచితముగా నెఱింగించిరి.* బంగాళాదేశముయొక్క బాహ్యాంతర పరిస్థితులను జక్కగ గమనించు వారెల్లరు నట్లులే భావింతురు. కాని, క్లయివు మాత్రము చలింపలేదు. తాను మాత్రము అట నిలిచి, 500 సోల్జరులను 2,100 సిఫాయిలను 14 ఫిరంగులను సమకూర్చి కర్నలు ఫోర్డు యనువానిని సైన్యాధిపతిగ నియోగించి, వారిని బంపివైచెను.

ఆ సమయమున నబాబునకును ఆంగ్లేయులకును గూడ గొప్ప యుపద్రవము సంభవించెను. రెండు మూఁడు సంవత్సరముల నుండియు బంగాళాదేశమున జరుగుచుండిన గందరగోళములను జుట్టునుగల రాజ్యాధిపతులు వీక్షించుచుండిరి. అట్టి వారలలో నలహా

* Cf, "The project met with unanimous condemnation. But Clive disregarding all opposition, prepared his armament."— Mill, Vol. III p. 280.

బాదు సుబేదారుఁడగు మహమ్మదు కులీఖాను యొకఁడు. ఆ సమీపముననుండిన రాజా సుందరసింగును రాజా బలవంతసింగును ఆతనికి సాహాయ్యమొసంగుటకు సంసిద్ధులై యుండిరి. బలవంతుఁడగు అయోధ్యాధీశుఁడు కూడ బంగాళాదేశముపై దండెత్త గోరి యుండెను. ఆ సమయముననే, ఢిల్లీశ్వరుఁ కుమారుఁడు కారణాంతరములచే నిజరాజధానిని వీడి రోహిల్లాదేశమునకు బాఱవలసిన వాఁడాయెను. యుద్ధసన్నద్ధులై యుండిన రాజ్యాధిపతులెల్లరు లెస్సగ విచారించి, తమరణోద్యమమునకు సార్వభౌముని కుమారుని నాయకునిగా నేర్పఱచిరి. సార్వభౌముని తరపున దాము దండెత్తఁగోరినటులు ప్రవర్తించినచో దమ పలుకఁబడి హెచ్చుగనుండునని గ్రహించియే వాగట్లొనరించిరి. ఢిల్లీశ్వరుని యధికారము నానాటికి సన్నగిలుచుండినను, ఆతఁడింకను సార్వభౌముఁడై యుండి, ప్రజాహృదయము నాకర్షించుచుండెను. బంగాళాధిపతి యాతనికింకను గప్పము చెల్లింపవలసినవాఁడై యుండెను. సార్వభౌముఁడు దుర్బలుఁడైనను, ఒక నబాబును దీసివేయుటకును, నింకొకని నియోగించుటకును ఆతని కధికార ముండెను. తనకుఁగల యధికారము ననుసరించి, బంగాళాబీహారు దేశములకుఁ దన కుమారు నాతఁడు సుబేదారునిగా నియమించెను. మీర్జాఫరుపై దండెత్తి సార్వభౌముని కుమారుని తద్రాజ్యాధిపతి నొనరింపవలయుననియు, తాము పెక్కులాభములను బడయవలయుననియును నాసించి, సమరకార్యైక తత్పరులై, వారు దాడివెడలిరి.

తనకు రానుండిన మహోపద్రవము నెఱింగినంతనే మీర్జాఫరు భయకంపితుఁడాయెను. ధనహీనుని కంటె బలహీనుఁడు వేఱొకఁడుండఁడు. సస్యములపైఁబడి విధ్వంస మొనరించు శలభగణముల



వలె, నాంగ్లేయులు దేశముయొక్క ఆర్థికస్థితిని జిందరవందర చేయుచుండిన ఆంగ్లేయుల కారణమున నిర్ధనజీవియై యుండిన మీర్జాఫరు యొక్క జీవితము నిరర్థకమై యుండెను. తన కుమారుని యొక్క దుష్ప్రవర్తనముచే నాతఁడు ప్రజాభిమానమునకు మఱింత దూరమగుచుండిన కారణమున, ప్రబల విరోధియూధములు దండెత్తిరని తెలిసినంతనే, మీర్జాఫరు భయభ్రాంతుఁడై మఱల నాంగ్లేయులమీఁదనే యాధారపడవలసిన వాఁడాయెను.

కాని, ఆంగ్లేయుల స్థితి మాత్రము నబాబుయొక్క స్థితికంటె క్షేమకరముగ నుండెనా? తన తోడియధికారులెల్లరు బంగాళాదేశమునందలి ఆంగ్లసైన్యములను ఉత్తర సర్కారులకు బంపుట క్షేమకరముకాదని యెంత చెప్పినను, దుడుకు స్వభావుఁడై మూర్ఖచిత్తుఁడై దురాశాపరవశుఁడై యుండిన క్లయివు సరకుఁజేయకుండుటచే నాంగ్లేయుల స్థితి నిజముగా మిక్కిలి ప్రమాదకరముగ నుండెను. కాని,ఆతనినిరంకుశప్రవర్తనమే, ఆతనిదుడుకుస్వభావమే, ఆతనియొండిసాహసమే, ఆతని నొకమహాపురుషునిగా నొనరింపఁజాలినవాయెను. అదృష్టదేవత యంధురాలనునార్యోక్తి సుప్రసిద్ధముకదా.

సార్వభౌముపుత్రుని యాజమాన్యముక్రింద బంగాళాదేశముపై దండెత్తగోరిన నృపాలు రెల్లరు తత్కార్యైక తత్పరులై రణమాచరించి యుండిరేని, ఆంగ్లేయులపై నాధారపడి యుండిన మీర్జాఫరు పరాజితుఁడై, రాజ్యభ్రష్టుఁడై యుండెడివాఁడు. తోడనే, ఆంగ్లేయుల యాధిపత్యము, అధికృతయును, మంటఁగలసి యుండెడిది; భావి హిందూదేశ చారిత్రము పూర్తిగ మాఱియుండెడిది *

* Cf. "A blow like this, at so critical a period, would have shaken to such a degree the tottering Government of Jaffier, that the incipient power of the English might have despaired of restoring it......"—Mill Vol. III. P. 286.

కాని, అయోధ్యదేశాధిపతి, మందబుద్ధియై, మిత్రద్రోహమును దలపెట్టి కడు హేయముగఁ బ్రవర్తించుటచే, నాంగ్లేయులకు రానుండిన యుపద్రవము తొలంగెను.

సార్వభౌముని కుమారుఁడు ముఖ్యముగా నలహాబాదు రాష్ట్రాధిపతి యగు మహమ్మదు కూలీఖానుపై నాధారపడి యుండెను. బీహారురాష్ట్రమునకు రాజధానియగు పాట్నానగరమును ముందుగా వశపఱచికొనవలయునని యెంచి వారిరువురు నా నగరమును ముట్టడించిరి. బీహారు రాష్ట్రాధిపతియగు రామనారాయణునకును మీర్జాఫరునకును మైత్రి లేదని పాఠకు లెఱింగి యున్నారు. కాఁబట్టి, రాజకుమారుని ప్రయత్నములకు రామనారాయణుఁడు దోహద మొసంగుట సహజము. రాజకుమారుని సైన్యములకు దాఱి యొసఁగి, సైన్యసమేతుఁడై యాతఁడు కూడ తోడ్పడి యుండెనేని, బంగాళాదేశము సులభముగా వారి యధీనమై యుండెడిది. కాని, అట్లుగాక, రాజకుమారుని వారించుటయే ఆచరణీయమని రామనారాయణుఁడు యోచించుటచే, మహమ్మదుకూలీఖాను పాట్నానగరమును ముట్టడింపవలసిన వాఁడాయెను. ముట్టడి జయప్రదముగా జరుగుచుండెను. పాట్నానగర దుర్గము కూలీఖానుయొక్క ఫిరంగులకు దాఱి యొసంగెను. బీహారురాష్ట్రముయొక్క రాజధానియగు పాట్నానగరము అతి శీఘ్రముగ నాతని యధీనము కానుండెను. అట్టి మహాసమయమున నాతని కొక గొప్పవిపత్తు సంభవించెను. తోడనే, సులువుగా వశము కానుండిన నగరరాజమును వశపఱచికొనకయే, దురదృష్టవంతుఁడగు ఖాను పరుగుపరుగున వెనుకకు మఱలవలసిన వాఁడాయెను.

అయోధ్యదేశాధిపతి సైన్యములను సమకూర్చుకొని తనకు సాహాయ్యమొనరించునని కూలీఖాను నిరీక్షించుచుండ, నాతఁడు



(కూలీఖాను) పాట్నానగరమును ముట్టడించునవుడే, యాతని రాజధానియగు నలహాబాదు నగరమును వశపఱచికొనవలయునని యాసించి, అయోధ్యదేశాధిపతి యా నగరముపై దాడివెడలెను. ఆతఁడట్లు హేయమగు మిత్రద్రోహమును దలపెట్టుటచేతనే, పాట్నానగరమును జయింపవలసిన కూలీఖాను నిజరాజ్య సంరక్షణార్థము రయమున నిర్గమింపవలసినవాఁడాయెను.

ఆంగ్లేయులకును మీర్జాఫరునకును రానుండిన మహా యుపద్రవ మాతెఱంగున నప్రయత్నముగా దొలంగెను. క్లయివుయొక్క సాహాయ్యమువలననే దనకు రాజ్యము దక్కియుండెనని మీర్జాఫరు భ్రమించి, అయ్యాంగ్లవీరునకు 'ఉమ్రాన్' యను బిరుదము నొసంగెను. కాని. క్లయివు వట్టి బిరుదములతో సంతసించువాఁడు కాఁడు గదా. కాఁబట్టి, ఆతని యభిప్రాయము నెఱింగి, ఆతని యభిప్రాయము నొక యాజ్ఞగా శిరసావహించి, 27,౮0,000 రూపాయిలు సంవత్సరాదాయముగల జాగీరు నాతనికి మీర్జాఫరు యొసంగెను: క్లయివు సంతుష్టాంతరంగుఁడాయెను.

కాని, ఆంగ్లేయుల యధీనమునఁజిక్కిన మీర్జాఫరుయొక్క యవస్థ నానాటికి దుర్భరమగుచుండెను. నాటి మీర్జాఫరుయొక్క యవస్థను బరికించువారికి అరేబియనునైట్సునందలి 'ముసలివాని' కథ స్మరణకు రాకమానదు. ఎట్టులైనను వారి పాశములనుండి తప్పించుకొని స్వచ్ఛందముగ మెలంగవలయునని ఆతఁడు పరితపింప సాగెను. కాని, ఆతఁడు సామర్థ్యముగల తంత్రజ్ఞుఁడు కాకుండుటచేతను, అడుగడుగునకు నాంగ్లేయుల సాహాయ్యమే యవసరమగుచుండుటచేతను, ఆతఁడు ఱెక్కలువిరిగిన పక్షివలె విలపింపసాగెను. ఎవరైనను వచ్చి తన్నుద్ధరింతురేమోయని యాతఁడు నిరీక్షించుచుండెను. ఆంగ్లమహాసముద్ర మధ్యమునఁబడి, స్వచ్ఛందజీవనమునకై

గిజగిజలాడుచుండఁ మీర్జాఫరున కాసమయమున డచ్చివారు గోచరించిరి.

హాలండు దేశస్థులగు డచ్చివారికి బంగాళాదేశమునందలి 'చిన్సూరా' యను గ్రామమున నొక కర్మాగారముండెను. వారి వ్యాపార మాదేశమున మిక్కిలి తక్కువగా నుండెను. బంగాళాదేశాధిపతి ఆంగ్లేయులపై నాధారపడియుండుటచే వారి వర్తకము గూడ మిక్కిలి వృద్ధిఁజెందెను. వారి యదృష్టమును గాంచినంతనే డచ్చివారు అసూయాపరులైరి. సముచిత ప్రయత్నము లొనరించి తాముగూడ ధనార్జన మొనరింపవలయునని డచ్చివారు సమకట్టిరి. ఆదేశమునందలి వర్తకమంతయుఁ బూర్తిగ నాంగ్లేయుల వశము కాకుండ తెఱంగున వర్తక సౌకర్యముల నేర్పఱచికొనుటయే వారి ప్రధానోద్దేశమైనట్లు స్పష్టమగుచున్నది.* ఆంగ్లేయ దుర్భర పీడనమును భరింపఁజాలని మీర్జాఫరుకూడ వారికి దగు ప్రోత్సాస మొసంగినట్లు చరిత్రకారులవలన దెలియవచ్చుచున్నది. అంతకంటె, స్వాతంత్ర్యమునకై తత్తరపడుచుండిన మీర్జాఫరుయును, ఆంగ్లేయులపై నసూయాపరులై యుండిన డచ్చివారును సహజముగ నొకరి సాహాయ్యము నొకరు విశ్వసించియుందురు. ఏది యెట్లున్నను, 200 డచ్చిసోల్జరులును 800 సిపాయిలును 1759 ఆగస్టుమాసమున హుగ్లీనది బ్రవేశించిరి. ఆంగ్లేయుల కయ్యది గొప్పవిపత్సమయమై యుండెను. క్లయివు సంఘాభిప్రాయ విరుద్ధముగ నాంగ్లసైన్యములను ఉత్తరసర్కారులకుఁ బంపియుండిన కారణమున, బంగాళాదేశము తలుపులు తెఱచిన కోటవలె నుండెను.

ఆసమయమున నాంగ్లేయులకును డచ్చివారికిని వైరము లేదు.

Vide—Mill. Vol, III P. 290.



కాఁబట్టి, డచ్చిసైన్యము హుగ్లీనది బ్రవేశించి వారికిఁ జెందియుండిన 'చిన్సూరా' ను జేరఁబోవుటయొక నేరము కాదు. అట్టి సందర్భమున వారిపై నాంగ్లేయులు దండెత్తుట ధర్మవిరుద్ధము. కాని, బంగాళాదేశమును దన కాణాచివలెఁ జూచుచుండిన క్లయివు డచ్చివారి యాగమనమును సహింపఁజాలఁడాయెను. కాఁబట్టి, ధర్మాధర్మవిమర్శనము నటుంచి, నోరెత్తుటకైనను మీర్జాఫరున కవకాశ మొసంగక, క్లయివు యుద్ధసన్నద్ధుఁడై, డచ్చివారిపైఁబడెను. వారిసైన్యము తుత్తునియలాయెను. క్లయివు విజయుఁడాయెను. తగు కారణము లేకుండ డచ్చివారిపై నాంగ్లేయులు దండెత్తుట ధర్మవిరుద్ధమై యుండినను, బలవంతులగు నాంగ్లేయులతో ధర్మాధర్మముల గుఱించి చర్చించినచో, తమరు బంగాళాదేశమున నిలుచుటకే యవకాశ ముండదని వెఱచి, తామే నేరస్థులమని డచ్చివారు అంగీకరించి, యుద్ధపుఖర్చులను గూడ నాంగ్లేయులకుఁ జెల్లించిరి. తోడనే, తానొనరించిన యపరాధము నెఱిఁగియుండిన క్లయివు డచ్చివారి నావలను, ధనమును, సామగ్రినిగూడ వారి కొసంగెను.

ఇయ్యది ఆంగ్లేయులకు మిక్కిలి లాభకరముగ నుండెను. వైరులగు ఫ్రెంచివారు దురదృష్టవశమున నింతకు బూర్వమే స్థానభ్రష్టులై యుండిరి.* ఇపుడు, డచ్చివారీ తెఱంగున భంగపడిరి. కావున, ఆంగ్లేయులు మఱింత నిరంకుశముగఁ బ్రవర్తించుట కవకాశ మాయెను.

ఈస్టుఇండియాకంపెనీని ఉచ్చస్థితికిఁదెచ్చి, మితిలేని ధనరాసులనార్జించి, తన కారణమున బంగాళాదేశమునకుఁ గలుగు నరాచకమును దుర్భరదారిద్ర్యమును దలంపక, 1,760 ఫిబ్రవరి మాసమున

* "ప్లాసీయుద్ధము" నందలి 11,12 పేజీలలో నీవిషయము వర్ణింపఁబడియున్నది.

క్లయివు ఇంగ్లాండు దేశమునకుఁ బోయెను. ఆతఁడొనరించిన ఘనకార్యములకు పరమానందభరితులై, ఆతఁడొనరించిన దోషములను దలంపక, ఇంగ్లాండునందలి కంపెనీ డైరక్టర్లు నవరత్నఖచితమగు ఖడ్గము నాతని కొసంగి బహూకరించిరి: నాటి యాంగ్లనృపాలుఁడగు మూడవ జార్జి క్లయివును ప్రభువుగ నొనరించెను: ప్రతిభాశాలియగు నాటి (ప్రధానమంత్రి)—పిట్టు—పలు తెఱంగుల నమ్మహావీరు నభినందించెను. అన్యాయార్జిత విత్తమును విరివిగ వెచ్చించుచు నయ్యాంగ్లనాయకుఁడు మహావైభవముతోఁ గాలము గడుపదొడంగెను.

క్లయివు బంగాళా దేశమున నుండినపుడే, మీర్జాఫరుయొక్క యవస్థ కడు హేయముగను కడు విషమముగను నుండెనని పాఠకు లెఱింగియే యున్నారు. క్లయివు నిష్క్రమించిన పిమ్మట నబాబుయొక్క అవస్థ యెట్లు మారెనో గమనింప వలసి యున్నది.

ఆంగ్లేయుల వాతఁబడిన బంగాళాదేశము ధనహీనమై కళావిహీన మగుచుండినను, వారి ధనాశ మాత్రము తీఱదాయెను. నబాబుయొక్క ద్రవ్యమును బీల్చుకొలఁది వారి ద్రవ్యావసర మధికమగుచుండెను. ఎక్కడిధనమైనను, ఎంతటి ధనమైనను, అచటికంపెనీ సేవకుల కైంకర్యమునకే చాలకుండెను.

క్లయివు వెడలునపుడు, 'వాన్సిటార్టు' యను నాతని దన స్థానమున గవర్నరుగ నియమించెను. చీకటికొట్టున నుంపఁబడి సజీవుఁడై వెలికివచ్చిన 'హాల్ వెల్' యును తదితరులును కంపెనీసంఘ సభ్యులై యుండిరి. క్లయివుచే నియోగింపఁబడిన వాన్సిటార్టు వక్రమార్గాన్వేషణమున కొంతమట్టుకు నాతనిగురువును బోలియుండినను, ఆతనికిగల యద్భుతమగు తెలివితేటలును, చాకచక్యములును వాన్సిటార్టుయందు గానరావు. తొల్లి, సురాజదౌలాను రాజ్య



భ్రష్టు నొనరించి మీర్జాఫరును సింహాసనాసీను నొనరించునపుడు, ఆంగ్లకంపెని సంఘసభ్యులగు క్లయివు ప్రభృతులు మితిలేనిధనము నార్జించియుండిన విషయము, 'వాన్సిటార్టు' మొదలగు వారి మనసునకు నెల్లపుడు గోచరించుచుండెను: వారుకూడ నట్టులే, హిందుదేశమున నుండినపుడే ధనార్జన మొనరింప వలయునని యోచించిరి:* అట్లు యోచించి, దుర్బలుఁడగు మీర్జాఫరును రాజ్యభ్రష్టు నొనరించి, ఆతని యల్లుఁడగు 'మీరుకాశిము'ను సింహాసనముపై నిడి, తామొనరించిన ఘనకార్యమునకై యాతనివలన ధనరాసులను జేపట్టవలయునని వారు నిశ్చయించిరి. తామొక్కరే లాభమంతయుఁ గబళించినచోఁ దమదేశస్థులు సహింపఁజాలరని యెంచి, కంపెనీకిగూడ లాభమును జేర్పవలయునని వారు యోచించిరి. భావిరాజ్యాధిపతియగు మీరుకాశిముతో నాంగ్లకంపెనీ సేవకు లొక సంధిని గావించిరి. అతి సారవంతములగు బర్ద్వాను మిడ్నాపూరు చిట్టగాంగు జిల్లాలను నబాబు ఆంగ్లకంపెనీకి శాశ్వతము నొసంగవలయును. ఇంకను మీర్జాఫరు చెల్లింపవలసియుండిన పైకమును గూడ నాతఁడు చెల్లింపవలయును. కర్నాటక దేశమున నాంగ్లేయులు కావించుచుండిన యుద్ధమున కాతఁడు 5,00,000 రూపాయిలను విరాళముగా చెల్లింపవలయును. వాన్సిటార్టు మొదలగు కంపెనీ యధికారుల కీక్రింది మొత్తములను మీర్ కాశిం చెల్లింపవలసియుండెను †

* "The Vast sums, obtained by a few individuals, who had the principal management of the former revolution, when Meer Jaffir trode down Suraj-ad-dowla his master, were held in vivid remembrance; and the persuation that similar advantages, of which every man burned for a share, were now meditated by the Select Committee, excited the keenest emotions of jealously and envy."
Mill, Vol. III, p. 309.

† R. Mill, Vol. III, p. 368.

| | | రూ. |
|---|---|---|
| వాన్సిటార్టు | ... | 5,80,000 |
| హాల్ వెల్ | ... | 3,09,370 |
| సమ్మర్ | ... | 2,80,000 |
| కైలాడ్ | ... | 2,20,000 |
| గైర్ | ... | 1,80,000 |
| స్మిత్ | ... | 1,34,000 |
| యోర్క్ | ... | 1,34,000 |

కుట్ర పూర్తియాయెను. కాని, మీర్జాఫరును రాజ్యభ్రష్టునొనరించుట కొక కారణమును నిరూపించుట యవసరమాయెను. కావున నాతనిపై నెన్నియో నేరములు మోపఁబడెను. ప్రసిద్ధపూరుషులెందఱో యాతనిచే వధింపఁబడిరని యాతనిపై నొక నేరమారోపించిరి. కాని, ఆతఁడు నిజముగ నిర్దోషియయ్యు, ఆతనికి నపకీర్తి తెచ్చు తలంపుననే నాటి ఆంగ్లకంపెనీ సేవకులు అట్టి నీచకార్యమునకు గడంగిరనియును, ఆ రేండ్లు గడచిన పిమ్మట బంగాళాదేశమునందలి కంపెనీసంఘసభ్యులే వ్యక్తపఱచిరి.* మీర్జాఫరును రాజ్యభ్రష్టు నొనరించుటకు నిరూపింపఁబడిన రెండవ కారణమెద్దియన, రాజ్యపరిపాలనము నెఱుంగని మీర్జాఫరును ద్రోసివైచినగాని దేశమున శాంతి నెలకొనదనియు, శాంతి నెలకొనినగాని తమకింకను నబాబువలన ముట్టవలసియుండిన ధనము ముట్టఁజాల

* Addressing the Directors on 30th September 1766, they say, "In justice to the memory of the late Nawab Mir Jaffir, we think it incumbent on us to acquaint you that the horrible massacres where with he is charged by Mr. Holwell in his address to the proprietors of East India Stock, are cruel aspertious on the character of the Prince, which have not the least foundation in truth."— quoted by Torren, M. P.—'Empire in Asia',—p. 44.



దనియును కంపెనీ సేవకులు నిరూపించిరి. కాబట్టి, స్వార్థపరులై ధనాశాపరవశులై యుండిన కంపెనీసేవకులు, మీర్జాఫరును రాజ్యభ్రష్టు నొనరించుట యావశ్యకమని స్థిరపఱచిరి.

వారొనరింపఁ గడంగిన దుష్కార్యమును సాధ్యమగు నంతవఱకు గప్పిపుచ్చుటకై, మఱియొక మాయోపాయమును వారాలోచించిరి.* పేరునకు మాత్రము మీర్జాఫరే నబాబుగ నుండి, ఆతఁడు రాజ్యాధికారమునంతయు దన యల్లుఁడగు మీరుకాశింయొక్క హస్తమున బెట్టవలయునని ఆంగ్లేయులు కోరిరి. తోడనే, వారి ద్రోహబుద్ధిని గుర్తించి, రాజ్యాధికారవైభవ విరహితుఁడై జీవచ్ఛవంబువలె నట నిలిచియుండుట మిక్కిలి యగౌరవమని భావించి, స్వార్థపరులును, విశ్వాసఘాతకులును అగు నాంగ్లేయులను విశ్వసించి వారిపై నాధారపడి యుండినందుల కెంతయు వగచుచు, నిజరాజధాని వీడి, మీర్జాఫరు కలకత్తానగరమునకుఁ బోయెను.

విచారగ్రస్తుఁడై, క్రోధైకధురీణుఁడై మీర్జాఫరు నిష్క్రమించినంతనే, మీరుకాశిము సింహాసనాసీనుఁడాయెను. తోడనే, మిత్రద్రోహమొనరించిన ఆంగ్లకంపెనీసేవకుల సంకల్పము సిద్ధించెను; వారికి ధనరాసులు లభ్యమాయెను.

మీరుకాశిం సింహాసనాసీనుఁడైన పిదప నెట్టి పరిస్థితు లేర్పడెనో గమనింపవలసి యున్నది.

* "Cf. An idea, however, of fidelity to the connection which they had formed......prevailed in the breasts of the Council; and a middle course was chosen"

Mill, Vol. III, p. 306.

# II అరాజకము.

సురాజదౌలావంటి దుడుకుస్వభావుఁడును, మీర్జాఫరువంటి దుర్బలుఁడును గాక, సింహాసనారూఢుఁడైన మీర్ కాశిం పరిపాలనాధురంధరుఁడును, ఆర్థిక శాస్త్రవేత్తయును, శాంతి సంస్థాపనాయత్తచిత్తుండును, కార్యదీక్షాపరతంత్రుఁడునై యుండెను. కాని, తన ప్రజల దుర్భరదారిద్ర్యావస్థను, గర్హితమగు నాంగ్లప్రవర్తనమును గుర్తించిన వాఁడగుటచే, నతిశీఘ్రముగ నాతనికిని ఆంగ్లేయులకును యుద్ధము సంభవించెను. అయ్యదే బక్సారు యుద్ధము.

సమర్థుఁడగు కాశిం రాజ్యాధిపతియైనంతనే, రాజ్యమున శాంతి నెలకొల్పుటకు వలయు మార్గముల నన్వేషింపఁగడంగెను. ధనసంచయమొనరించినగాని శాంతి నెలకొను నవకాశముండదని గ్రహించి, తీవ్రప్రయత్నము లొనరించి కొంత ద్రవ్యమును గూడదీసి, ఆంగ్లసైన్యములకుఁ జెల్లింపవలసియుండిన పైకము నాతఁడు చెల్లించెను. తనసైన్యములకుఁ జెల్లింపవలసిన పైకమును గూడ చెల్లించి, వాని నాతఁడు వశపఱచికొనెను. ధనమునకై తల్లడిలుచుండిన ఆంగ్లకంపెనీకి దానొడఁబడినట్లు ఆరేడు లక్షల పైకమును గూడ జెల్లించెను.

తన యధికారమును ధిక్కరించు జమీందారుల గర్వమడంచుచు, తనకు రావలయు పన్నులు సుంకములు మొదలగువానిని శ్రద్ధగా ఖచితముగా వసూలుచేయుచు, ఒక్కకాసైనను అనవసరముగా వెచ్చింపక, మిక్కిలి వివేకముగా బ్రవర్తించుచుండిన మీరుకాశిము ఆంగ్లేయులకుఁ జెల్లింపవలసియుండిన 79,00,000 రూపాయిలను బూర్తిగా జెల్లించివైచెను.* అటు లొనరించి, తన సై

* R. Mill—Vol. III; P. 325.



న్యమును జక్కగ సంస్కరించి, పరిపాలనావిధానమునందు వలయు సంస్కరణములను నాతఁడు ప్రవేశపెట్టెను. దేశము క్రమముగా నుచ్చదశకురాకుండెను. కాని, ధనాధికార బల గర్వములచే పైపెక్కిన ఆంగ్లేయుల కౌర్యప్రవర్తనముచే నామహనీయుని ప్రయత్నము లన్నియు బూదిలో బోయు యాజ్యము వలె నిరర్థకములగుటయేగాక, తుద కాతఁడు రాజ్యభ్రష్టుఁడు కూడ నాయెను.

ప్లాసీయుద్ధమున జయించుటచేతను మీర్జాఫరును రాజ్యాధిపతి నొనరింపఁజాలుటచేతను; ఆ నబాబు కేవలము వారిపై నాధారపడి, కీలుబొమ్మవలె తిరుగుచుండుటచేతను; వారినే విశ్వసించి వారిపై నాధారపడియుండిన మీర్జాఫరును మోసగించి హఠాత్తుగ రాజ్యభ్రష్టు నొనరించి, మఱియొకని రాజ్యాధిపతి నొనరింపఁజాలుటచే తను ఆంగ్లేయులు గర్వాంధులు కాఁజొచ్చిరి. ఎట్టి యకార్యమునకైన వెనుదీయక, ఎట్టి హైన్యమునకైన దిగఁబడుచు మితిలేని ధనార్జన మొనరింపఁగలుగుటచే గర్వాంధులగు నాటి కంపెనీ సేవకులు మదాంధులుకూడ కాఁజొచ్చిరి. నబాబుయొక్క ద్రవ్యమును దినుచు మదించుచుండిన కంపెనీసైన్యములు సిద్ధముగ నుండుటచే, రాజ్యాధిపతియగు నబాబును తృణీకరించుచు, అమాయకు లగు జనులను పిండి పీడించుచు, ఘోరముగ హింసించుచు, నిరంకుశముగను భయంకరముగను వారు ప్రవర్తింపఁజొచ్చిరి.

దురహంకార స్వభావులగు నాటి యాంగ్లకంపెనీసేవకులలో 'ఎల్లిస్' యను నాతఁ డొకఁడు. మీరుకాశిము రాజ్యాధిపతియైన యనంతర మాతఁడు (ఎల్లిసు) పాట్నానగరమునందలి కర్మాగారమున కధికారి యాయెను. ఈతఁడు యధికారము వహించినది మొదలు, నబాబుయొక్క రాజ్యాంగమును అణుమాత్రమైనను గౌర

వినకుండుటయేగాక, రాజ్యాధిపతియగు నబాబును సహితము గడ్డిపఱకకంటె హేయముగ జూడ నారంభించెను.*

ఒకానొక సమయమున, ఒక కంపెనీసేవకుఁడొకఁడు నల్లమందు గొనిపోవుచుండెను. ఆనల్లమందు కంపెనీకిఁ జెందియుండెనను నెపమున నబాబుయొక్క 'కలెక్టరు'ను మోసగించి, సుంకము చెల్లించకుండ దాటివేయవలయునని ఆ కంపెనీసేవకుఁడు ప్రయత్నించెను. కాని, నబాబుయొక్క యధికారి ఆ మోసమును గనిపెట్టుటచే, నయ్యాంగ్లసేవకుని వారింపఁగడంగెను. తోడనే, యుక్తాయుక్తములను విచారింపక, నబాబుయొక్క యుద్యోగిని వెంటనే పట్టి బంధింపవలయునని దుర్మదాంధుఁడగు 'ఎల్లిసు' తన సైన్యాధిపతి నాజ్ఞాపించెను. కాని, ఎల్లిసుకంటె సైన్యాధిపతియే వివేకవంతుఁడగుటచే నాతఁడు సరసముగఁ బ్రవర్తించెను. వెంటనే, ఎల్లిసుయొక్క స్వభావము వేఱొకవిధమున వ్యక్తమాయెను. ఆంగ్లేయులపై మీర్జాఫరు పూర్తిగ నాధారపడియుండినపుడు, క్లయివు ఆతనిని బీడించి, సురేకారవ్యాపారమును స్వాధీనపఱచికొని యుండిన విషయమును పాఠకు లెఱింగియే యున్నారు. నాటినుండియు నాంగ్లేయు లావ్యాపారమున మంచి లాభము నార్జించుచుండిరి. కాని తాను రాజ్యాధిపతియగుటచే నబాబు ఆంగ్లేయుల యడ్డంకి లేకుండ తనకు వలయు సురేకారమును గొనిపోవుచుండెడివాఁడు. నబాబునకును నాంగ్లేయులకును నా సందర్భమున నెట్టి వివాదము రాకుండ కాలము గడచుచుండెను. కాని, గర్వాంధుఁడగు ఎల్లిసు వేఁతేరగనే రంగము మాఱిపోయెను. ఒకనాఁడు వాడుక ప్రకార

* "He treated the Nabob with the most insulting air of authority; and broke through all respect for his government"— Mill Vol. III, p. 322.



ము, నబాబుయొక్క ఉన్నతోద్యోగి యొకఁడు నబాబుతరఫున గొంత సురేకారమును గొనెను. తోడనే, ఎల్లిసు యాజ్ఞాపింప, కంపెనీసైనికు లాతని బట్టి బంధించి సంకెలలువైచి, నబాబునకావిషయమై యేమియు నెఱింగింపకయే, కలకత్తానగరమునకాతని బంపివైచిరి. ఏపాపమెఱుంగని ఆహైందవ ఉన్నతోద్యోగిని కలకత్తానగరమున బహిరంగముగా కొరడాలతో బాదవలయుననియు, ఆతని చెవుల నుత్తరింపవలయుననియును ఆంగ్లసంఘసభ్యులు కొందఱు తీవ్రముగా గోరిరి.* అట్టివారి వాతఁబడిన ఆ మహానీయుని కెట్టిగతి సంభవించెనో దైవమెఱుఁగు. ఎల్లిసుయొక్క దురహంకార స్వభావమును దెలుపు మఱియొక విషయమును గూడ నుదాహరింతము. ఆంగ్లేయ సైనికు లిరువురు పాఱిపోయిరి. వారిరువురును నబాబునకు జెందియుండిన 'మాంగ్హీరు' దుర్గమున దాఁచబడిరని ఎల్లిసు యనుమానించెను. నిజముగా నయ్యాంగ్లపౌలుబోతు లా దుర్గమున దాగియుండిరా, లేదా, యని ఆతఁడు విచారింపలేదు. వారు నిజముగా నందు దాగియుండినను, రాజ్యాధిపతియగు నబాబునకా విషయమును నివేదింపవలయును. కాని, ధూర్తుఁడగు ఎల్లిసు ధర్మాధర్మములను విచారించువాఁడు కాఁడు. దాగియుండిన ఆంగ్లసైనికులను మాంగ్హీరు దుర్గాధిపతి తత్క్షణము తన యధీనము చేయఁడేని, దుర్గమునఁ జొరఁబడి నలుదెసల బరిశోధింపవలయునని ఆజ్ఞాపించి, కంపెనీసైన్యము నొండు ఎల్లిసు పంపినవాఁడాయెను. ఆసైన్యము మాంగ్హీరు చేరినంతనే ఆ పురపాలకుఁడు వారి యుదంతము నెఱింగి, తన దుర్గమున నాంగ్లేయు లెవ్వరు లేరని వారి కెఱింగించెను. కాని, ఆంగ్లసైనికు లాతని మా

* "Some of the Council insisted that he should be publicly whipped at Calcutta; others, that he should have his ears cut off" Mill, Vol. III, p. 323.

టను విశ్వసింపరైరి. వారిని సమాధానపఱచుటకై యిరువురు సైనికోద్యోగులను లోనికిఁ గొంపోవుట కా పురపాలకుఁడు సమ్మతించెను. కాని, ఆంగ్లేయులింకను సంతసింపరైరి. కాఁబట్టి, చేయునది లేక, నబాబుయొక్క యనుమతి లేకుండ సాయుధులై యేతెంచు నాంగ్లసైనికులను లోనఁ బ్రవేశపెట్టుట వివేకము కాదని యెంచి, తోడనే తలుపులు బిగియించి, సమీపించు వారిపై తుపాకులను ప్రయోగింతునని ఆపురపాలకుఁడు తెలియఁబఱచెను. పురపాలకుఁడు సమంజసముగ బ్రవర్తించెననియు, నబాబుయొక్క యనుమతి వడయకుండ ఆతని దుర్గమున జొరఁబడ గడంగు వారలే నేరస్థులనియును ఎల్లరు గ్రహింపఁగలరు. కాని, ఎల్లిసు మాత్రము వేరుగ భావించెను. ఐనను, మీరుకాశిము మాత్రము తీవ్రపడుట పాడికాదనియెంచి, కలకత్తానగరమునందలి వర్తకసంఘాధ్యక్షున కావిషయమును నెఱింగించెను. అపుడు నబాబుయొక్క యనుమతిపై, నాయాంగ్లసంఘాధికారి మాంగ్విరు దుర్గమును బరిశోధించుట కొక సైనికోద్యోగిని నియోగించెను. కాని, ఆంగ్లకంపెనిసేవకుఁడగు ఎల్లిసుయొక్క దుష్ప్రవర్తనమే బహిర్గతమాయెనుగాని, దుర్గమునందు ఏకును గానరారైరి.

వక్రమార్గములచే నధికారసమన్వితులై, ధనికులై, బలవంతులై, గర్వాంధులై, మదాంధులై తుదకు దయారహితులైన ఆంగ్లసేవకులు పైనుదహరించిన తెఱంగున రాజ్యాధిపతియగు నబాబును తృణీకరించుటయేగాక, సస్యశ్యామల శోభితమై లక్ష్మీనివాసమై యొప్పు బంగాళాదేశమును నిస్సారముగను నిర్జరారణ్య ప్రదేశముగను అచిరకాలమున నొనరించిరి. మేటి మొగలాయి సామ్రాజ్యమునందలి రాష్ట్రములలోనెల్ల వంగదేశము మిక్కిలి ధనవంతమైనదని ప్రసిద్ధిగాంచియుండెను. లక్ష్మీదేవి తన నివాసార్థము



దేశదేశములను వెదకి బంగాళాదేశమే తనకు నివాసయోగ్యముగ నుండెనని కనుగొనినట్టు అసాధారణవైభవముతో నలరారుచుండిన యాదేశము ధనాశాపరవశులై యుండిన కంపెనీసేవకుల దుష్ప్రవర్తనముచే దారిద్ర్యదేవతా కాలవాలమాయెను. నాటి జనులు పడిన పాట్లు వారే యెఱుంగవలయు; దైవమెఱుంగవలయు; మనము మాత్రము చక్కఁగా గుర్తింపఁజాలము.

కల్పవృక్షమని ప్రసిద్ధిగాంచిన హిందూదేశముతో వ్యాపార మొనరించి ధనార్జన మొనరించుటకేగదా, ఆంగ్లేయు లేతెంచియుండిరి. బంగాళాదేశమునందలి ఆంగ్లకంపెనీ సంఘాధికారులు నాటి మొగలాయి సార్వభౌము నతిదైన్యముగ వేఁడికొనుటచే, దేశమున నుండు ఆసీలు మెట్టులకు సుంకములు చెల్లింపకయే ఎగుమతి దిగుమతి వ్యాపారముల నొనరించుటకు వారి కాతఁడనుజ్ఞ నొసంగెను. అందులకు కంపెనీవారు సంవత్సరమునకు మూఁడు వేల రూపాయిలను జెల్లించుట కియ్యకొనిరి. నాటినుండియు, కంపెనీసంఘాధ్యక్షుని సంతకము గల యధికారపత్రము కంపెనీసేవకులు ప్రదర్శించుచు, సుంకము జెల్లించు నవసరము లేక నిర్విఘ్నముగ వ్యాపార మొనరించుచు, కంపెనీకి అమితమగు లాభమును గూర్చుచుండిరి. ఇట్టి సదుపాయము కంపెనీకి మాత్రమే చెందియుండెననియు, నావలపై నితరదేశములనుండి దిగుమతియగు సామానులకును బంగాళాదేశమునుండి పైదేశములకు నెగుమతియగు సామానులకును మాత్రమే అన్వయించుననియు పాఠకు లెఱుంగవలయును.

ఇట్టి సత్వము నాంగ్లేయులకు దయచేసిన తానొక విషబీజమును నాటియుంటిననియు, బంగాళాదేశస్థులను మలమల మాడ్చివైచు విషానలజ్వాలలను వెడలగ్రక్కు మహావిషవృక్షముగ నా విష

బీజము పరిణమించుననియును నాపాదుషా యెఱుంగఁజాలఁడాయెను.

కంపెనీతరపున వ్యాపారమొనరించుచుండిన ఆంగ్లేయులు తాముకూడ స్వంతముగ వ్యాపారమొనరించి లాభమార్జింపవలయునని వాంఛించిరి. ఆదేశమున వ్యాపారమొనరించుచుండిన వర్తకులవలె సుంకములను జెల్లించుచు వారు లాభమార్జింపఁగడంగిరేని, ఒకవిధముగ బాగుండెడిది. అట్లుగాక సుంకముల నెగవేసినచో హెచ్చులాభమును గ్రహింపనగునని యెంచి, తమ సంఘాధికారియొక్క సంతకమును బ్రదర్శింపుచు, నబాబుయొక్క యధికారుల కండ్లు గప్పివేయుచు, ఆంగ్లసేవకులు ధనవంతులు కాఁజొచ్చిరి. కాని, వివేకవంతుఁడగు నబాబు వారి మోసమును గనిపెట్టి వారివలన దన ప్రజలకు గలుగు నష్టమును గుర్తించి, ఆంగ్లేయుల దురాచారములను వారించునపుడు మాత్రము, న్యాయవిరుద్ధమగు తమ వ్యాపారమును వారు త్యజింపవలసినవారగుచుండిరి. దేశాధిపతుల యధికారమును ధిక్కరించి స్వైర విహారమొనరించు కాలమింకను గొంతదూరమున నుండుటచే, వారు ప్రతీకారమేమియు నొనరింపఁ జాలరైరి.

కాని, ప్లాసీయుద్ధకారణమున నొక గొప్పపరివర్తనము జరిగియుండెను గదా. నబాబులను బ్రసన్నులఁ జేసికొనుటకై దైన్యముగ మెలంగుచుండిన ఆంగ్లేయులు నాటగోలె నబాబును ఒక గడ్డిపఱకకంటె నికృష్టముగ జూచుచు విచ్చలవిడిగ బ్రవర్తింపఁజొచ్చిరి. రాజ్యాధిపతి వారి యధీనమున నుండుటచే, వారిని నిరోధింపవలసిన యవసరము లేకపోయెను. తోడనే, వారి ధనాశ విజృంభించెను. సుంకములు చెల్లింపకుండ వ్యాపారమొనరించి లాభమార్జించి కుబేరులై నిజదేశమున కరిగి, తమ దేశస్థుల కండ్లెఱ్ఱనగునట్లు వైభవసమన్వితులై సుఖజీవన మొనరింపవలయునని వారు వాంఛించిరి. వారట్లు దురాశాపరవశులై యుండుటచే, వారి దుష్కార్యములవలన హైందవ వర్తకులకును, బ్రజలకును, నబాబునకును గలుగు నష్టమును వారు తలంపరైరి.



నిర్మలాకాశమున మొదట దృశ్యాదృశ్యముగ దోచు మేఘము క్రమక్రమముగా బెరిగి పెరిగి, యాకసమంతయు నావరించి, భయంకరాకారము దాల్చి, తుదకు సంతతధారాపాతముగ ఝరీవేగమున వర్షించి, మార్గమధ్యమున జిక్కువడు పాంథులను ఘోరముగ బాధించునట్లు; ఆంగ్లేయులు ప్రారంభమున ధనార్జనము మితముగా ప్రారంభించి, అన్యాయార్జితవిత్తమును జవిజూచు కొలది వారి ధనతృష్ణ తీక్ష్ణమగుచుండుటచే, న్యాయన్యాయములను పాపపుణ్యములను గణింపక, శక్తివంచన లేకుండ, ప్రతివ్యాపారమునందును జొరఁబడుచు, దేశమంతటను వ్యాపించి, చెల్లింపవలసినసుంకములను ఎగవేయుచు ధనవంతులు కాఁజొచ్చిరి. తుదకు, నూనె, చేవలు, వరిగడ్డి, వెదుళ్లు, బియ్యము, ధాన్యము, తమలపాకులు, పోకలు లోనుగాగల సమస్తదినుసులతోడను ప్రతిజిల్లాయందును ప్రతిగ్రామమునందును, వారుగాని వారి యనుచరులుగాని వ్యాపారమొనరింపఁగడంగిరి. నదులపై బోవు ప్రతి నావయందును ఆంగ్లేయ పతాక మెగురుచుండెను. ఇంతటి వ్యాపారమును సుంకములు చెల్లింపకుండ ఇంత విరివిగ నాంగ్లేయులు సాగించుచుండుటచే, రాజ్యాధిపతియగు నబాబున కెంతటి నష్టము వాటిల్లునో పాఠకులు గుర్తింతురుగాక. ఆంగ్లేయు లెట్లు ప్రవర్తించుచుండినను, హైందవ వర్తకులు మాత్రము యథావిధిగ సుంకములను జెల్లింపవలసియుండుటచే, వారి యవస్థ ఎంత దుర్భరముగ నుండెనో గూడ పాఠకులు గుర్తింతురు గాక. సుంకముల నెగవేయు నాంగ్లేయులతో, సుంకములను జెల్లించు హైందవులు సరిగా వ్యాపార మొన

రింపఁ జాలరనియు, అట్టి పరిస్థితులయందు దైశిక వ్యాపారము ఆంగ్లేయుల వశమగుననియు గూడ పాఠకులు గ్రహింతురుగాక.

ఆంగ్లేయుల దుష్ప్రవర్తన మీతెఱంగున దుస్సహము నుండినను, వారికింకను సంతుష్టి లేకపోయెను. ధనము లభించుకొలఁది వారి ధనాశ మఱింత తీక్ష్ణము కాఁజొచ్చెను.* ధనాశచే బారవశ్యులై, అంధులై మిన్నుమన్ను గానక బ్రవర్తించు నాంగ్ల కంపెనీసేవకులు ఒకయుపాయ మాలోచించిరి. తాము కొను సామానులు హీనక్రియమునకు లభించునేని, తమ లాభము అధికమగునని వారు కనిపెట్టిరి.

అట్టి ధనాశకుఁ జిక్కిన కంపెనీసేవకులు కడుహేయముగఁ బ్రవర్తింప నారంభించిరి. తమకు వలయు సామానులను సగము వెలకు నొసంగవలయునని ఒకప్పుడును, నాల్గవవంతు† వెలకే యొసంగవలయునని యొకప్పుడును అంగ్లసేవకులు జనులను నిర్బంధింప దొడంగిరి. అట్టి హీనక్రియమునకు దమ సామగ్రిని యొసంగవలసిన పనివాండ్రు ఎట్లు జీవింపఁగలరు? వారికి జీవించుటకు వలయు లాభమైనను లేకుండుటయేగాక, నష్టమును సహితము వారు భరింపవలసిన వారగుచుండిరి. ఐనను, ధనాశాపరవశులైన ఆంగ్లసేవకులు క్రూరముగఁ బ్రవర్తించుచుండుటచే, తమకు లాభములు లే

* Cf. " The sudden affluence thrust upon the Caleutta community by the lavish compensation paid for the losses sustained.........turned the heads of all, and led to a scramble for riches which brought into painful prominence the evil feautures of human nature. Gentlemen... were tempted to sell their souls for gain......" V. A. Smith, p. 497.

† They forcibly take away the goods and commodities of the Reiats, Merchants, etc., for a fourth part of their value; and by ways of violence and oppressions they oblige the Reiats, etc., to give five rupees for goods which are worth but one rupee......"

Quoted by R. C. Dutt ( " India under the early British rule", p. 23) from Meer Kasim's letter, May 1762.



కపోయినను, నష్టమును గూడ భరింపవలసి వచ్చినను, దొరలకు వలయు సామానులను దయారుచేసి దేశస్థులు సమర్పింపవలసిన వారైరి. ఆంగ్లేయుల పీడనము ఎంత దుర్భరముగ నుండినను, జనులు భరింపవలసి యుండెను. పదార్థములను తయారుచేయుట మానివేయుటకైనను, అవకాశము లేకపోయెను! తమకు వలయు పదార్థములను దమకు వలయు నతిచౌకధరలకు నొసంగని జనులను బట్టి బంధించి, ఆంగ్లసేవకులు కొరడాలతో బాదఁగడఁగిరి. అంతటితోనైనను, వారి ధనతృష్ణ తీరదాయెను. సామగ్రిని సగము ఖరీదునకును నాల్గవవంతు ఖరీదునకును గొనుటచేఁ గలుగు లాభము కూడ వారికిఁ జాలదాయెను! సరుకులను నాల్గవవంతు ఖరీదునకు గొనునట్టులే, వానిని బజారుధరలకంటె నాలుగైదు రెట్లుఖరీదునకు విక్రయించినచో నమితమగు లాభము లభించునని ఆంగ్లసేవకులు భావించి, అట్టు లాచరించిరి!!! తాము చెప్పు ఖరీదులకు తమ సామానులను కొనని జనులను గూడ వారు పట్టి బంధించి శిక్షింప నారంభించిరి. అంతటితోనైనను వారువిరమించిరా? వారువిక్రయించు సామానుల నెవ్వరైన విక్రయింతురేని, వారిసగూడ బట్టి శిక్షింపమొదలిడిరి!

అట్టి ఘాతక కార్యముల నొనరించు నాంగ్లసేవకులను నబాబు యొక్క యధికారు లెవరైనను వారింపఁగడంగిరేని, అట్టి యధికారులను గూడ పట్టి బంధించి శిక్షించుచుండిరి.* ఈ తెఱంగున

* Cf.— " When the collectors of these tolls, or transit duties, questioned the power of the dustuck and stopped the goods, it was customary to send a party of sepoys to seize the offender and carry him prisoner to the nearest factory".— Mill, Vol., III, p. 327.

" English agents or gomastahs, not contented with injuring the people, trampled on the authority of govetnment, binding and punishing the Nabob's officers, whenever they presumed to interfere. This was the immediate cause of the war with Meer Kasim."— Quoted by Mill (Vol. III, p. 329) from Verelst's 'View of Bengal'.

నబాబుయొక్క ప్రజలును ఆతని యధికారులును మాత్రమే గాక, దేశమునందలి ఉన్నతవంశసంజాతులగు జమీందారులుగూడ, క్రూరులగు నాంగ్లసేవకుల దురాగ్రహానలజ్వాలలకు నాహుతియగుచుండిరి. కఠినాత్ములగు నాంగ్లసేవకుల వాతఁబడి పడరానిపాట్లు పడుచు గిజగిజలాడుచుండిన జనుల దుస్థితిఁగాంచి భరింపఁజాలక అడ్డువడగడంగు జమీందారులను జడిపించుచు, బంధించుచు, శిక్షించుచు, వారిపై నెద్దియో నిందవైచుచు వారివద్ద ధనమును పిండఁగడంగిరి.* తుదకు, నాంగ్లకంపెనీసేవకు లరుదెంచుచుండిరని తెలియునంతనే, గ్రామస్థులు భయవిహ్వలులై, ప్రాణములు దక్కినచాలునని యెంచి, అతిరయమున బలాయన మొనరింప నారంభించిరి.†

నాటి యాంగ్లకంపెనీ సేవకుల కారణమున జెలఱేగిన యరాజక దావానలమునకు హైందవులు సహితము దోహద మొసంగఁగడంగిరి. స్వార్థపరులును, కఠినాత్ములును, పాపాత్ములును, దేశద్రోహులును నగు హైందవ వర్తకులు కంపెనీసేవకులకు లంచము లొసంగి, వాని యనుమతి వడసి, వానిపేరున వ్యవహరించుచు దీనులగు జనులను ఘోరముగ బాధింపఁగడంగిరి.

ఆదేశస్థులు కఠినులగు పాలకుల క్రౌర్యము గూడ చవిచూచియుండిరి; కాని, ఇట్టి క్రౌర్యమునకు మాత్రము వారెన్నడును గు

* Cf,— "...they even pass sentences on the Zamindarss themselves, and draw money from them by pretended injuries......"

Quoted by R. C. Dutt—p. 24 and Mill—Vol. III, p. 331.

† Cf.— "and most of the petty towns and serais were deserted at our approach, and the shops shut up from the apprehensions of the same treatment from us"—Hastings.

Quoted by Mill, Vol. III, p. 329.



రియై యుండలేదు. అయ్యది కేవలము రాక్షస ప్రభుత్వము వలెనుండెనని 'మెకాలే' వ్రాసి యున్నాడు.*

తుదకు, ఆంగ్లకంపెనీ సంఘాధికారియగు వాన్సిటార్టుయును, సంఘమునందలి యొకసభ్యుఁడగు హేస్టింగ్సుయును గూడ తమ దేశస్థుల రాక్షసప్రవర్తనము గాంచి సహింపఁజాలకపోయిరి. నబాబు శాంతము వహించుగొలది తమ దేశస్థులు చెలఱేగుచుండుటచే, తుద కాతఁడు విసిగి వేసారి యుద్ధసన్నద్ధుఁడగునని వాన్సిటార్టు భావించెను. కాఁబట్టి, ఆతని చెంతకేగి, సందర్భోచితముగ ముచ్చటించి, ఆతనిని శాంతపఱచి, తమకు లాభకరముగ నుండు శాంతిని దేశమున నెలకొల్పవలయునని యెంచి, వాన్సిటార్టు హేస్టింగ్సు లుభయులుం గలసి ప్రయాణమై మాంగ్హీరు నగరమున నుండిన మీర్ కాశింను దర్శించిరి.

ఆంగ్లేయుల క్రౌర్యప్రవర్తనముచే దందహ్యమానమానసుండై యుండినను, కాశిం శాంతిసంస్థాపనాయత్తచిత్తుండై యుండుటచే, నేతెంచిన ఆంగ్లనాయకులకు సగౌరవముగను సవినయముగను ఆతిథ్యమొసంగెను. వారి నట్లు గౌరవించిన పిమ్మట, ఆంగ్లేయుల దుష్ప్రవర్తనముచే దనకును దనప్రజలకును గలిగిన మహా యుపద్రవము నాతఁ డభివర్ణించెను. ఇకనైనను, ఆంగ్లేయులు ధర్మబద్ధులై మెలంగుట కిచ్చగింతురేని, వారొనరించిన దౌష్ట్యములను దాను స్మరింపనని నబాబు తెలియఁబఱచెను. ఆంగ్లేయులు దైశిక ప

* R. "They had been accustomed to live under tyranny, but never under tyranny like this."

Macaulay—Essay on 'Clive'

R.— "It resembled the government of evil Genii, rather than the government of human tyrants'

Macaulay.

ర్తకమునఁ బాల్గొనుట కేవలము ధర్మవిరుద్ధమని ఆతఁడెఱింగించె
ను: ధర్మపథము దప్పి మొఱకులై ఆంగ్లేయులు దైశిక వర్తకము
నఁ జొఱఁబడుటచే దన రాజ్యాంగ మనేక తెఱంగుల విచ్ఛిన్నమా
యెనని ఆతఁడు వ్యక్తీకరించెను. దైశిక వ్యాపారమునఁ బాల్గొను
హక్కు తమకులేదని కంపెనీ గవర్నరగు వాన్సిటార్టు సహిత మం
గీకరించెను.—కాని, అనుభవించుచుండిన హక్కును విడనాడుటకు
మాత్ర మాతఁ డంగీకరింపఁడాయెను * అందలి పరమార్థమేమన-
తన ప్రవర్తనము న్యాయవిరుద్ధముగ నుండినను, లాభకరముగ నుం
డిన వ్యాపారమును విడనాడుట కాతఁడు సమ్మతింపఁడాయెను. కాఁ
బట్టి, ఆవిషయమై, ఆతఁడును నబాబుయును గలసి చాలదూరము
విచారించిరి. తుదకు, ఆంగ్లేయులు కూడ బంగాళాదేశస్థులవలె
సుంకములు చెల్లించుచు వ్యాపారమొనరించుటకు నబాబు సమ్మ
తించెను. ఆతఁడట్లు యొడంబడినను, వాన్సిటార్టు సంతుష్టుఁడైనట్లు
కానరాదు. ఎట్లైనను దేశమున శాంతి నెలకొల్పి తన ప్రజల ను
ద్ధరించుటకై తత్తరపడుచుండిన మీరుకాశిము ఆంగ్లేయుల కొక్క
గొప్ప సదుపాయము చేయుట కియ్యకొనెను. బంగాళాదేశస్థులు
మొత్తముమీఁద 100 కి 25 చొప్పున సుంకములు చెల్లించుచుండి
రని చెప్పవచ్చును. కాని, ఆంగ్లేయులు 100 కి 9 చొప్పున సుంక
ములు చెల్లించిన జాలునని నబాబు సమ్మతించెను: ఆతని యౌదా
ర్యమును గాంచి వాన్సిటార్టు సంతుష్టాంతరంగుఁడై, నబాబుయొ
క్క సెలవుగైకొని కలకత్తానగరమునకుఁ బోయెను.

* Cf.—"Mr. Vansittart, though fully aware, as he himself declares, that the interior trade, which had been grasped by the company's servants, was purely usurpation, was yet, he says, "unwilling to give up an advantage which had been enjoyed by them, in a greate or less degree, for five or six years."

Mill, Vol. III—p. 333.



కాని, పాపపుణ్యములను గణింపక, బంగాళాదేశధనము దినుచు
మదించి కేవలము జ్ఞానరహితులై యుండిన ఆంగ్లకంపెనీసంఘసభ్యు
లకు వాన్సిటార్టుయొక్క ప్రవర్తన మంతయు మిక్కిలి యసహ్య
కరముగ నుండెను.* తాము నిర్ణయించు నత్యల్ప ధరలకు సరకుల
ను గొనుచు, తాము నిర్ణయించు నత్యధికధరలకు వానిని విక్రయిం
చుచు నిరంకుశముగ దోపిడిచేయుచుండిన మహాశయులకు సుంక
ము చెల్లించుటయే కష్టముగ నుండుటచే, వారు వాన్సిటార్టుపై
నాగ్రహావేశపూరితులై రి. దైశిక వ్యాపారమున బాల్గొను హ
క్కు తమకుఁ గలదనియు, తమ సరకులపై సుంకములు విధిం
చు నధికారము నబాబునకు లేదనియును వారు తీర్మానించిరి.
రాజ్యాధికారియగు నబాబునకే సుంకములు విధించు నధికారము లే
దని నిరూపించుటయు, ఆంగ్లకంపెనీ సంఘసభ్యు లట్లు తీర్మానించుట
యును మిక్కిలి సాహసము, కేవలము హాస్యాస్పదము. అట్లు తీ
ర్మానించి, తొంటియట్లు, నిరంకుశముగ సుంకముల నెగవేయుచు
వ్యాపారములను సాగింప వలయుననియు, తమ వ్యాపారమున కెట్టి
యడ్డంకియైనను గలిగింప సాహసించు నబాబుయొక్క యుద్యో
గులను బట్టి బంధింపవలయుననియును దేశమున నుండు తమ కర్మా
గారాధ్యక్షులకు వారు తెలియఁబఱచిరి.

గవర్నరగు వాన్సిటార్టు యొడంబడినట్లు ఆంగ్లేయులు ప్రవర్తిం
తురని మీరుకాశిం భావించెనే గాని, వారట్టి హేయమగు తీర్మాన
ములఁ జేయుదురని ఆతఁడెఱుంగఁజాలఁడాయెను. తమ దు
ర్వ్యాపారములను వారింపఁగడంగు హైందవోద్యోగులను బట్టి, కం

* Cf.— "Greedy of gain, careless of the public interest, they refused to ratify the agreement,....."

Col. Malleson's "Decisive battles of India", p. 138.

పెనీ యధికారులు తొంటికంటె తీవ్రముగా బాధింపఁగడంగిరి. పరదేశాగతులగు నాంగ్లేయులును వారి సేవకులును సుంకముల నెగవేయునపుడు, సుంకములు చెల్లించుట తన ప్రజలకు మిక్కిలి దుర్భరముగ నుండునని గుర్తించి, వారు మాత్రము సుంకముల నేల చెల్లింపవలయునని వితర్కించి, వారుకూడ సుంకములను జెల్లింపనక్కరలేదని చాటించి, ఆసీలుమెట్టుల నన్నింటిని మీరుకాశిము తీసివైచెను. ఆకారణమున దనకు జాల నష్టము కలుగునని ఆతఁడెఱింగియుండెను. కాని, తెగఁబడిన వ్యాఘ్రములవలె సంచరించుచుండిన ఆంగ్లేయులను అనేక కారణములచే శిక్షింపనొల్లని వాఁడగుటచేతను, తన ప్రజల దుర్భరస్థితిఁగాంచి సహింపఁజాలని వాఁడగుటచేతను, ఆమహాశయుఁ డట్లొనరించెను.

నబాబుయొక్క ప్రవర్తనము మిక్కిలి యౌదార్యముగను, మిక్కిలి శ్లాఘనీయముగను నుండెనని ఎల్లరు గ్రహింపఁగలరు. కాని, కేవలము స్వార్థపరులై యుండిన ఆంగ్లకంపెనీసేవకులు న్యాయమును లజ్జను బూర్తిగ విడనాడిరని, చరిత్రకారుఁడగు ‘మిల్లు’ వ్రాసియున్నాఁడు.* ఆంగ్లేయులకును, తన ప్రజలకును లాభనష్టములు సమానముగ నుండవలయునని యెంచి నబాబు అట్లాచరించి యుండెను. కాని, తమవలె హైందవులు కూడ సుంకములు చెల్లింపకుండ వ్యాపార మొనరింతురేని, తమ లాభములు తగ్గునని కంపెనీసేవకులు గుర్తించిరి. తోడనే, వారలత్యుగ్రులై, తనప్రజలపై నబాబు సుంకములు విధింపవలయునని ఆంగ్లకంపెనీ సంఘసభ్యు లాజ్ఞాపించిరి. కంపెనీసేవకులు న్యాయవిరుద్ధముగ సుంకముల నెగవే

* Cf.— “The conduct of the company's servants, upon this occasion, furnishes one of the most remarkable instances upon record of the power of interest to extinguish all sense of justice, and even of shame.” Mill—Vol, III, p. 337



సి వ్యాపార మొనరింపఁబూనుటయే యధమము; అట్టియెడ, నబాబుయొక్క ప్రజలు సుంకములనుఁ జెల్లింపవలయునని వారు శాసించుట యధమాధమము.

తుదకు నిరుతెగలవారును యుద్ధసన్నద్ధులైరి. ఈసందర్భమున నొక విషయము గమనింపవలసియున్నది. మీరుకాశిం సింహాసనారూఢుఁడైన సందర్భమున, బహుమానముల నెపంబున లంచములు కుడిచిన యాంగ్లకంపెనీసంఘసభ్యులు కొందఱు తమదేశమున కరిగియుండిరి. వారి స్థానమున నాసంఘమున బ్రవేశించిన వారలు, తమకెన్నడు ధనరాసులు లభించునో, తామెన్నఁడు నబాబును దోచుకొనఁగలుగుదుమో, యని తత్తరపడసాగిరి. అట్లు ధనాశాపరవశులై యుండిన యన్నరాధములకు కాశింయొక్క సత్పరిపాలనము కడు యసహ్యకరముగను కడు దుస్సహముగను గాన్పించెను. ఆమహాశయుఁడు రాజ్యభ్రష్టుఁడైనగాని తమదురాశలు ఫలింపనేరవని యెంచి, వేయి విధంబుల నాతనిగారించి, యాతని నెట్లులైనను యుద్ధరంగమున కీడ్వవలయునని యాసంఘసభ్యులు నిశ్చయించిరి.* మఱియు, మీరుకాశింతో యుద్ధము సంభవించునేని, ఆతనితోడి సంధికి మాత్ర మొడబడరాదనియు, ఆతనిని రాజ్యభ్రష్టునొనరించి మఱియొకనిని రాజ్యాభిషిక్తు నొనరింపవలయుననియును, వారలు కృతనిశ్చయులై యుండిరి.† సస్యముల మధ్యమునను, ఫలవృక్షముల మధ్యమునను ‘దిష్టిబొమ్మ’ను వ్రేలాడఁగట్టి దృష్టిదోషమును దొలగించి, ఫలసాయమును బూర్తిగ ననుభవించు కర్షకునివలె, మానవ విగ్రహము నొండు సింహాసనముపై బ్రతిష్ఠించి, జనుల కండ్లుకప్పి, నిరంకుశముగ ధనార్జన మొనరింపఁగోరిన ఆం

* Cf.— Malleson's “Decisive battles”,— p. 143, 4.

† R.— Mill, Vol. III, p, 343.

గ్లకంపెనీసేవకులకు, శ్లాఘనీయమగు కాశిముయొక్క సత్పరిపాలనము కడుంగడు దుస్సహముగనుండెనే! కాఁబట్టి, తమచే బరాభవింపఁబడిన మీర్జాఫరునే మఱల రాజ్యాధిపతి నొనరింపవలయునని వారు యోచించిరి. మీర్జాఫరు బలహీనుఁడును ముసలియునైయుండుటచే, హేయమగు తమ దుర్వ్యాపారములు నిర్విఘ్నముగఁ గొనసాగునని వారు గ్రహించియుండిరి. వారు విధించిన షరతులకన్నింటికిని ఆ చీకుతేఁడు యొడంబడెను. ఉప్పుమీద మాత్రము 100 కి 2½ చొప్పునతప్ప, ఆంగ్లవర్తకులవద్ద సుంకములు వసూలు చేయకుండుటకును, తన ప్రజలుమాత్రము యెప్పటియట్లు సుంకములు చెల్లింపవలయునని శాసించుటకును నాతఁడు సమ్మతించెను. 12,000 ఆశ్వికదళమును, 12,000 కాల్బలమును నెల్లపుడు భరించుటకు సహితి మాతఁడంగీకరించెను. మీరుకాశిం రాజ్యాధిపత్యము వహించినపుడు, ఆంగ్లసైన్యములకగు ఖర్చులనిమిత్తము, సారవంతములగు బర్ద్వాను, చిట్టకాంగు, మిడ్నాపూరు జిల్లాలు వారి యధీనమై యుండెనుగదా. వానిని మీర్జాఫరు కాయపఱచుటయేగాక, యుద్ధము ముగియువఱకును మాసమునకు 5,00,000 రూపాయిల చెల్లించుటకుగూడ నాతఁడొడంబడ వలసిన వాఁడాయెను. యుద్ధపుఖర్చులక్రిందను, కంపెనీకి గలుగు నష్టముక్రిందను 30,00,000 రూపాయిలు చెల్లించుటకుగూడ నాతఁడొడబడెను. కంపెనీకేగాక, కంపెనీసేవకులకు సహితము గలిగిన నష్టమును భరించుటకు గూడ నాతఁడియ్యకొన వలసినవాఁడాయెను. ఆవిషయమై యాతఁడు చెల్లింపవలసిన పైకము 10,00,000 రూపాయిలకు మించి యుండదని కంపెనీ సంఘసభ్యులాసమయమునఁ దెలియఁబఱచిరి; కాని, మీరుకాశిం రాజ్యభ్రష్టుడై, మీర్జాఫరు రాజ్యాధిపతియైనపిదప, తమకు రావలసిన పైకము 20,00,000 రూపాయిలనియు, పిమ్మట



30,00,000 అనియు, అటుపిమ్మట 40,00,000 అనియును నిరూపించి, తుదకు 53,00,000 రూపాయిలని వారు నిర్ణయించిరి!* ఈ మొత్తములుగాక, సైన్యమునకు బ్రత్యేకముగా 25,00,000 రూపాయిలును, అందు సగము పైకము నావికాదళమునకును నొసంగుటకు గూడ నా వృద్ధరాజు యంగీకరించెను.

తొల్లి, తనకుగలిగిన భంగపాటును దలంపక, దౌర్భాగ్యుఁడగు మీర్జాఫరు పై నుదహరించిన విషమషరతుల కొడంబడి, మఱల సింహాసనము నారోహించుటకు నుద్యుక్తుఁడాయెను.

# III బక్సారు యుద్ధము.

ఆంగ్లకంపెనీసేవకుల సాహాయ్యముచే దాను వంగదేశ సింహాసనము నారోహించినప్పుడే, వారి నైజమును మీరుకాశిం చక్కఁగ గుర్తించియుండెను. వారు దురాశాపరులనియు, విశ్వసనీయులు కారనియును నాతఁడెఱింగియుండెను. వారినే విశ్వసించి, వారి మీదనే యాధారపడి యుండిన మీర్జాఫరున కెట్టి దురవస్థ ప్రాప్తించెనో ప్రత్యక్షముగ గోచరించుచుండుటచే, దానట్టి నేర మొనరింపరాదని యాతఁడు నిశ్చయించుకొని యుండెను. పాతకములలో నె

*"That demand, however, was soon after stated at 20,00,000, then at 30,00,000, afterwards at 40,00,000, and at last was fixed at fifty three lakhs of rupees. We are assured by the director of the company, "That all delicacy was laid aside in the manner in which the payment was obtained for this sum, of which seven-eights was for losses sustained, or said to be sustained, in an illicit monopoly of the necessaries of life". Mill—Vol. III—p. 355

ల్ల ఋణపాతకమే యతి దారుణమైనదని యెంచి, ఆ పాతకముచేతనే మీర్జాఫరు దుర్భరాంగ్లపాశబద్ధుఁడాయెనని గ్రహించి, తన రాజ్యాంగము సంస్కరించుకొని, వారికిఁ జెల్లవలసి యుండిన పైకమును బూర్తిగ మీరుకాశిం చెల్లించివైచెను.

పరాధీనము సహింపఁజాలని పోటుమానిసియగు కాశిమునకు ముఖ్యముగ సైన్యమవసరమై యుండెను. పాశ్చాత్యశిక్షణమువడసిన కంపెనీ హైందవసైన్యములు రణరంగములయందుఁ బ్రదర్శించిన కౌశల్యమును గాంచియుండిన వాఁడగుటచే, నాతఁడు పాశ్చాత్యసేనానులను జేరదీసి, వారికిఁ బ్రత్యేక సౌకర్యముల నేర్పఱచి, వారి సాహాయ్యముచే దన సైన్యము నుచితభంగి సంస్కరించెను. మఱియు, నాతఁడు లోకానుభవము గల కార్యశూరుఁడగుటచే, ఫిరంగులను దయారుచేయుట కొక కర్మాగారము కూడ నిర్మించెను.

హేయముగను, నిరంకుశముగను బ్రవర్తించు నాంగ్లకంపెనీ సేవకులకు దూరముగ నుండుటయే క్షేమకరమని యెంచి, చిరకాలమునుండి రాజధానిగా నుండిన మూర్షదాబాదు నగరమువీడి, మాంఘీరును దన రాజధానిగా నాతఁడొనరించుకొనెను.

మీరుకాశిం సంగ్రామప్రియుఁడని భావింపరాదు. అతఁడు రణవ్యాపార పారంగతుఁడని నిర్వచించుటకు మాత్రము సందియములేదు. అతఁడు మహామానియనియు, ప్రజాభిమానియనియు, స్వాతంత్ర్యప్రియుఁడనియు నెల్లరు నంగీకరింపవలయు. పరదేశాగతులగు నాంగ్లేయులను విశ్వసించి, వారిమీదనే యాధారపడి యుండిన తన మామగారి కెట్టి దురవస్థప్రాప్తించెనో గాంచిన వాఁడగుటచే, నాతఁడు ఆత్మసంరక్షణార్థమే యట్టి ప్రయత్నముల నొనరించెను. ఆంగ్లకంపెనీ సేవకుల కారణముననే దనకు రాజ్యాధిపత్యము ప్రాప్తించియుండుటచే, దానొడంబడినట్లు వారికిఁ జెల్లింపవలసిన ధన



రాసులనెల్లఁ జెల్లించి యాతఁడు ఋణవిముక్తుఁడాయెను. కాని, వర్తకమునకై యేతెంచిన కంపెనీసేవకులు తాము గడించిన హక్కుల ననుభవించు వర్తకము మీదనే దృష్టి నిలుపవలయును గాని, తనపై వారు స్వారి చేయుట కవకాశ మొసంగరాదని యాతఁడు కృతనిశ్చయుఁడై యుండెను. కాని, రాజ్యాధిపతికి నుచితమగు స్వాతంత్ర్యము నిలిపికొనఁగడంగు నవాబునకును, ధనాశచే మైమఱచి యెట్టి యకార్యమునకైనను దెగబడు కంపెనీసేవకులకును, సఖ్యమెట్లు కుదురును?

మీరుకాశిం నలుబదివేల సైన్యమున కధినాధుఁడై యుండెను. అందు పెక్కుసైన్యములు పాశ్చాత్య శిక్షణము వడసియుండెను. దురహంకార స్వభావులగు నాంగ్లకంపెనీసేవకుల వలన దన కెన్నఁడైనను ముప్పు వాటిల్లునని గ్రహించినవాఁడగుటచే, నాత్మసంరక్షణార్థము మాతఁడెల్లపుడు మెలకువగనే యుండెను. సైన్యవ్యవస్థలయం దాతఁడు మిక్కిలి కుశలుఁడగుటచే, యుద్ధరంగమున సైన్యాధిపత్యము వహించుటకు గూడ జాలి యుండెను. ఐనను, చివరవఱకు నాతఁ డతి సహనముగ నుండెను. కాని, తాను సహించుకొలది ఆంగ్లసేవకులు చెలరేగుచుండుటచే నాతఁడు చేయునది లేక, రణ మాచరింప వలసినవాఁడాయెను.

ధూర్తుఁడగు ఎల్లిసుయొక్క ప్రవర్తనమును పాఠకులు గమనించియేయున్నారు. ఈ కంపెనీ సేవకుని కారణముననే యుద్ధముకూడ ప్రారంభమాయెను.*

పరిస్థితులు మీరుకాశింనకు ప్రతికూలముగ నుండినట్లు గోచరించును. ఆతని రాజధాని కడుదూరముగ నొక మాఱుమూలనుం

* 1763 జూను 23 వ తారీఖు.

డుటయొకటి: ఆంగ్లకంపెనీసేవకుల క్రూరనిరంకుశ ప్రవర్తనముచే నాతని రాజ్యాధికారము విచ్ఛిన్నమైయుండెను. ఈకారణముననున్, చివరవఱకు నాతఁడు శాంతి నెలకొల్పవలయునని యే తత్తరపడుచుండుటచేతను, యుద్ధమాకస్మికముగ ప్రారంభమగుటచేతను, మఱింత సైన్యమును గూడగీయుట కాతని కవకాశము లేకపోయెను. మఱియు, నాంగ్లేయులు మీర్జాఫరును సింహాసనాసీను నొనరించుట గూడ కాశీమునకు మిగుల హానికరముగనే యుండెను.

ఐనను మీరుకాశీము జయప్రదముగ ప్రారంభించెను. ఎల్లిసు మొదలగువారల మదమడంచి, వారిసైన్యములను తుత్తునియలొనరించి, వార లాక్రమించిన స్థలముల నాతఁడు స్వాధీనపఱచికొనెను. ఈలోపున, దేశద్రోహులలోనెల్ల నగ్రగణ్యుఁడని చెప్పదగు మీర్జాఫరును, ఆతనిఁ గీలుబొమ్మవలె ద్రిప్పుచుండిన ఆంగ్లేయులును యుద్ధసన్నద్ధులై బయల్వెడలిరి. మీర్జాఫరు తమచెంతనుండిన కారణమున గలుగు పలుకుబడిచేతను, పాశ్చాత్యశిక్షణము సహజముగా శ్రేష్ఠతరమైనదగుటచేతను నాంగ్లేయులు బలవంతులై యుండిరని చెప్పవచ్చును.

భగీరదీనదీతీరమున నున్న 'ఆగర్ద్విప్' సమీపమున నిరుతెగలవారును యుద్ధమునకు దలపడిరి. అసాధారణ ప్రతిభాశాలియగు సైన్యాధిపతియని ఆంగ్లచరిత్రకారుల మన్నన వడసిన మహమ్మదు తాకీఖాను కాశిం తరపున నాయకత్వము వహించి యుండెను. జూలై, 19వ తారీఖు సూర్యోదయావసరమున యుద్ధము ప్రారంభమాయెను. కొంతకాలము, ఆంగ్లహైందవసైన్యములు రెండును సమానముగ హోరాహోరి బోరాడుచుండుటచే, జయాపజయంబు లనుమానంబుగ నుండెను. కాని, క్రమముగా నాంగ్లసైన్యము చలింపనారంభించెను. అనుభవజ్ఞుఁడగు తాకీఖాను ఆవిషయమును



వెంటనే గుర్తించి, శత్రుసైన్యమును ఛేదించి మహాజయము బడయుట కయ్యదే తరుణమనియెంచి, తన ప్రత్యేకాశ్వికదళముతో నాతఁడు శరవేగమున ముందుకుబోయెను. ఆ సమీపముననే, కాశిం యొక్క సైన్యభాగములొకటి యుండెను. స్వామి యన్నము దినుచుండినందులకు సార్థకముగా రణరంగంబున విజృంభించి శత్రుజన దుర్నిరీక్ష్యుండై యుండిన తాకీఖానునకు ఆసైన్యాధిపతికూడ నమ్మహాసమయమున దోడ్పడి యుండెనేని, ఆంగ్లేయులకు నపజయము ప్రాప్తించి యుండెడిది. తోడనే సంగ్రామముకూడ ముగిసి యుండెడిది.* ఆసైన్యాధిపతి యట్టు లాచరింపక, తాకీఖానుపైదనకుఁగల విరోధమాత్సర్యములను బాటించి, సాహాయ్యము మిక్కిలి యవసరమై యుండిన యమ్మహాముహూర్తమున మిన్నకుండి, స్వామిద్రోహివలెను దేశద్రోహివలెను సంచరించెను. ఆంగ్లసైన్యాధిపతికూడ, తాకీఖానువలె నద్భుతమగు ధైర్యస్థైర్యములుగల మహావీరుఁడగుటచే; దన యవస్థ కడు ప్రమాదకరముగ నుండినను నించుకేని చలింపక, సూటిగా గుఱిచూచి, మహాసంరంభముతో దూకుచుండిన శత్రువులపై తుపాకులు వదలెను. తోడనే, వీరాగ్రేసరుఁడగు తాకీఖాను, తన యనుచరులతోగూడ నేల గూలెను, ఆంగ్లేయులు విజయులైరి. పిమ్మట వారు మూర్షదాబాదు నగరమును స్వాధీనపఱచుకొనిరి.

మీరుకాశిం యింకను బలవంతుఁడయియే యుండెను. ఆతని పాశ్చాత్యసైన్యాధిపతులును, ఇతర మహమ్మదీయ సైన్యాధిపతులును జీవించియే యుండిరి. ఆతని ఫిరంగిదళము కూడ భద్రముగనే

*The irregular horsemen,...who might have decided the victory, and with it the war, in favour of Mir Kasim, took no part in the action and retired after it had been decided."

Malleson.—p. 149,

యుండెను. పాశ్చాత్యశిక్షణము గఱచిన పటాలములును, వన్నెగాంచిన యాశ్వికదళంబులును నింక ననేకము లుండెను. కావున, అగ్రద్వీప ప్రాంతమున దన సైన్యవిభాగమునకు వాటిల్లిన భంగము నెఱింగినంతనే, సుమారు పాతికవేల సైన్యమును సముచిత సన్నాహములతో కాశిం పంపినవాఁడాయెను. ఈసమయమున దనకు విజయము ప్రాప్తించునదియే యాతఁడు విశ్వసించి యుండెను.

మూర్షదాబాదు నగరమునకు సుమారు 40 మైళ్ల దూరమున నుండిన 'గిరియా' ప్రాంతమున కాశింయొక్క సైన్యము విడిసియుండెను. పర్వతమయమై సహజముగ దృఢముగనుండిన యాప్రదేశమును మీరుకాశిం మఱింత బలపఱచెను. సైన్యసంరక్షణార్థ మాతఁడు రణఘుడలు త్రవ్వించి, తదితర సన్నాహములగూడ నొనరించెను. అట్టి సురక్షితప్రదేశమున నాతని సైన్యము చక్కని వ్యూహము బన్నుకొని నిలిచియుండెను. 'సమ్రూ', 'మార్కార్' యను కాశింయొక్క పాశ్చాత్యసైన్యాధిపతులు తమ సురక్షిత సైన్యవిభాగములతో మధ్యప్రదేశమున నిలిచియుండిరి. ప్రసిద్ధిగాంచిన యాశ్వికదళముతోడను, తగు కాల్బలముతోడను 'అసదుల్లాఖాను' దక్షిణభాగమున నుండెను. ఆ యాశ్వికదళమున కెడమవైపున తుపాకీవాండ్రును, వారికి వెనుకభాగమున, సైన్యసమేతుఁడై 'ఆలీఖాను' యును నుండిరి.

ఆగష్టు, 2వ తారీఖున నాంగ్లేయులు కూడ యుద్ధసన్నద్ధులై యరుదెంచిరి. వారి సైన్యమునందు 1000 సోల్జరులును, 4000 సిపాయిలును నుండిరి. మందుగుండు సామాను మొదలగు పరికరములుగూడ విరివిగనుండెను. బహుసమర్థుఁడగు 'ఆడమ్సు' వారి సైన్యాధిపతియై యుండెను. కాశింయొక్క సైన్యము పన్నిన వ్యూహమును లెస్సగ బరిశీలించి, ఆంగ్లసైన్యాధిపతికూడ తగినయేర్పాటు



లొనరించుకొనెను. వారికొకవైపున 'భగీరథి' యును, రెండవవైపున 'బాన్సిలీ' యును ప్రవహించుచుండెను. ఈరెండు ప్రవాహములు వారి వెనుకభాగముననే గలిసియుండెను. ఇట్లు ప్రవాహపరిరక్షితంబైయుండిన ప్రదేశ మాంగ్లేయులకు మిక్కిలి క్షేమకరమైనదే, కాని, అపజయము ప్రాప్తించునేని, శత్రువుల వాడికైదువుల కెరయగుటయో, లేక, చుట్టిముట్టి ప్రవహించుచుండిన నదీప్రవాహంబులంబడి మరణించుటయో, తప్ప, గత్యంతరముండదు. ఆంగ్లసైన్యాధిపతి క్లయివువలెనే యపారధైర్యస్థైర్యములు గలవాఁడనుటకు సందియములేదు. కాని, "బంగాళాది దేశంబులను బాలించువారు, ఆంగ్లేయులా, లేక, మీరుకాశిమా" యను తీవ్రసమస్యను పరిష్కరించు యుద్ధమును అట్టి ప్రమాదకరమగు ప్రదేశమున నాచరింపగడంగు సైన్యాధిపతికూడ మోటు సాహసముగల మానిసియనియే చెప్పవలయు.

ఆంగ్లసైన్యమధ్యభాగమున యూరపియను దళముండెను. హైందవసైనికులు వారి కిరువైపుల నుండిరి. వారి వందున నచ్చటచట ఫిరంగు లమరియుండెను. ఒక్క సిపాయి దళముమాత్రము వెనుక నుంచఁబడెను. సైన్యమున కిరువైపుల నదులు ప్రవహించుచుండెనని పాఠకు లెఱింగియే యున్నారు గదా.

ఇరుపక్షముల వారును సర్వసన్నాహము లొనరించుకొని యుండుటచే నిరువురును దమతమ ఫిరంగులు మ్రోగించుచు, యుద్ధమునకు దలపడిరి. ఆకోలాహలములో, నాంగ్లకాల్బలము ముందుకు నడచెను. తోడనే, కాశింయొక్క పాశ్చాత్యసైన్యాధిపతుల సైన్యవిభాగములును, ఆంగ్లేయుల యూరపియనులును నొండొరుల దాకిరి. యుద్ధము ప్రారంభమగుట గాంచి, దక్షిణపార్శ్వముననుండిన

అసదుల్లాఖాను తన సుప్రసిద్ధాశ్విక దళముతో నటు దిరిగి, వాయువేగమున నతి సాహసముగ వైరిపై లంఘించెను. హఠాత్తుగ పిడుగువలె పైబడిన వైరిని వారింపఁజాలకుండుటచే, నాంగ్లసైన్యముయొక్క వామభాగము తుత్తునియలాయెను. అచ్చటి ఆంగ్లసిపాయిలు ధైర్యముగ బోరాడిరి. కాని, కార్యము లేకపోయెను. ఖానుయొక్క సైనికుల కరవాలముచే కొందఱు నఱుకఁబడిరి: కొందఱు, సమీపమున నుండిన 'బాన్సలీ' నదిలోనికి తరుమబడిరి. తోడనే, సంభవించిన మహోపద్రవమును గుర్తించి, వెనుక నిలిచియుండిన సిపాయి పటాలమును వారి సాహాయ్యమునకై యాంగ్లసైన్యాధిపతి పంపఁగడంగెను. కాని, ఈలోన, అసదుల్లాఖానువలెనే దానుగూడ పరాక్రమోజ్జ్వలుండై వెలుంగవలయునని యాసించి, బదరుద్దీన్ ఖాన్ యను నాయకుఁడు తన యాశ్విక దళమును వెంట నిడికొని, 'సమ్రూ' 'మార్కారు' లతో బోరాడుచుండిన ఆంగ్లసైన్యముపై జిచ్చర పిడుగువలె బడి, వారికి వెఱపు గొలిపి, రెండు ఫిరంగులను వశపఱచికొనెను. ఆ సమయముననే, ప్రసిద్ధసైన్యాధిపతియగు 'నజీబుఖాను' కూడ హుంకరించి, వారిపై శరవేగమున లంఘించెను. ఇట్లు దావానలమువలె నలుదెసలను గాఱుక్రమ్మిన విరోధి యోధముల ధాటికి కంపెనీ సైన్యములు నిలువజాలకుండెను. వారి వామభాగము ముందుగనే తుత్తునియలాయెను: వారి మధ్యభాగమునకు గొప్ప యుపద్రవము సంభవింపనుండెను: అపాయము సంభవించునపుడు వినియోగించుటకై దాచి యుంచిన సైన్యముకూడ వ్యయమై యుండెను. అట్టి మహాసమయమున, విశేష సైన్యసమేతుఁడై నిలిచియుండిన ఆలీఖానుకూడ, తోడి సైన్యాధిపతులవలెనే, విజృంభించి యుండెనేని, ఆంగ్లేయులకు సంపూర్ణపరాభవము సంభవించుట తథ్యము: కాశిమునియొక్క మహాప్ర



యత్నము లన్నియు ఫలప్రదము లాయెడివి: ముందువెనుక లాలోచింపక, కడు ప్రమాదకరమగు ప్రదేశమున రణమాచరింప సాహసించిన కంపెనీ సైన్యాధిపతికి తన యపరాధము తెల్లమై యుండెడిది. కాని, అట్టి మహాసమయమున, సమయోచితంబుగ విజృంభించి, తన స్వామికి మహావిజయము గూర్చుటకు మాఱుగ, నయ్యాలీఖాను మందమతియై యతి మందముగ మెలంగెను. అట్టిసమయమున నాంగ్లసైన్యాధిపతి వ్యక్తీకరించిన ధైర్యస్థైర్యములు వర్ణనాతీతములు. తన సైన్యమునకు బ్రాప్తింపనుండిన మహాసంకటమును గుర్తించి, డేగవలె నలుదెసల బరికించి పరికించి, ఆలీఖానుయొక్క బుద్ధిమాంద్యమును గుర్తించి, అతనివలన దనకెట్టి యుపద్రవము సంభవింపదని గ్రహించి, అచ్చటి తనసైన్యమునందలి సగముభాగమును దీసుకొని, బిఱబిఱపోయి, శత్రుజన పరివృతులై తహతహ లాడుచుండిన సైన్యవిభాగమునకు సమయోచితంబుగ దోడ్పడెను. ఇంతలో, తెగిపోయిన ఆంగ్లేయ వామభాగముకూడ సద్దుకొని, మఱల శ్రేణులు దీర్చుకొనెను. సాహాయ్యా వరుదెంచుటచే, కంపెనీ యూరపియను దళము తెప్పరిల్లి, తొంటి ధైర్యము ధరించి, కోల్పోయిన ఫిరంగులను మఱల వశపఱచికొనెను. ఇట్లుండ, యుద్ధము శీఘ్రముగా ముగించి మహావిజయము నందవలయునని యెంచి, పరాక్రమవంతుఁడగు అసదుల్లాఖాను రయమున ముందుకు బోవ గడంగెను. కాని, ఆలీఖానుయొక్క కారణమున యుద్ధమద్దుతిరుగుటచే నాతఁడు వెనుకంజ వేయవలసినవాఁడాయెను. అట్టి సమయమునకే ఆంగ్లసైన్యాధిపతి నిరీక్షించుచుండెను. అపజయమువలన గలుగు మహోపద్రవము నెఱింగిన యాసైన్యాధిపతి, తనసైన్యము నంతటిని చలించిన వైరిపై తక్షణము

వదలెను. అట్టి సమయమున కాశిముయొక్క పాశ్చాత్యసైన్యాధిపతులు, ప్రాణములపై నాసవదలి విజృంభించుటకు మాఱుగ, నుపేక్షించిరి. ఇట్లు వీరును, అట్లు అలీఖానుయు బ్రవర్తించుటచే, నసదుల్లాఖాను, ప్రతాపవంతుడయ్యు, నాంగ్లఝరీప్రవాహమున కడ్డు నిలువనేరక రణరంగమునుండి తొలంగెను. ఆంగ్లేయుల కాతెఱంగున విజయము చేకూఱెను.

గిరియాయుద్ధమున దనకు సంపూర్ణ విజయము యలవడు ననియే కాశిము విశ్వసించి యుండినను, జయాపజయములు దైవాధీనంబులని యెఱింగిన వాఁడగుటచే, 'ఉండ్వానలా' యను కొండలోయలో మఱియొక సైన్యము నాతఁడు భద్రపఱచి యుంచెను. పాశ్చాత్యశిక్షణము గఱచిన నాలుగువేల పటాల మొకటియు, ఇతర కాల్బలము అశ్వికదళము పిరంగిదళము గలసి యెనిమిదివేల సంఖ్యగల పటాలములును నందుండెను. అనుభవజ్ఞులగు సైన్యాధిపతులుకూడ నందుండిరి. సహజముగా నా ప్రదేశము మిక్కిలి దృఢమై యుండెను. అవసరమగు స్థలములందు రణఘడలు తీయించి, అంబరచుంబితంబులగు ప్రాకారంబులను నిర్మించి, నూరు ఫిరంగుల నుచితస్థలంబుల నిలిపి, యద్దానిని శత్రుజన దుస్సాధ్యంబుగ నొనరించెను. ఆ దుర్గమునకు ముందుగా సఘాతమై యిరువదియడుగుల వెడల్పుగా నుండిన యగడ్తగూడ దీయించెను. దాటుటకు వీలులేని యాబ్రదేశము ఆ యగడ్తను రక్షించుచుండెను. మఱియు, దాఁటరాని యాప్రదేశమున నొకవైపున గంగానదియు, రెండవవైపున 'ఉండ్వా' యను ప్రవాహమునుగూడ, త్రవ్వని పరిఖలై, ప్రవహించుచుండెను. అట్లనేక తెఱంగుల ప్రకృతిచేతను, మానవునిచేతను భద్రపఱుపఁబడి యుండిన యా దుర్గరాజము పరాధీనమగుట యసంభవమని న్యాయముగ భావించి, తన కుటుం



బమును, ధనాగారమును మాత్రము 'రోటాస్' యను దుర్గమున నుంచి, మీర్ కాశిమ్ మాంగ్హీరు దుర్గమున నిలిచియుండెను.

గిరియా యుద్ధమున బలాయన మొనరించిన సైన్యములు కూడ 'ఉండ్వానలా' దుర్గమునకే యేతెంచెను. ఆ దుర్గమును ముట్టడించుటకై యరుదెంచు మహాసైన్యమును వారించుటకు గొలది మంది సైనికులు మాత్రమే చాలును. అంత బలవంతముగ నుండిన యా దుర్గరాజమును రక్షింపఁగడంగిన మహాసైన్యమునందలి వారలెల్లరు స్వామిభక్తిపరాయణులై, ధైర్యవంతులై, యప్రమత్తులై మెలంగిరేని, ఆంగ్లేయు లా పొలిమేర గాలిడుటకునైన నవకాశ ముండఁజాలదు.

గిరియా యుద్ధమున జయించిన యాంగ్లసైన్య మాదుర్గరాజమును శీఘ్రముగా సమీపించి, ఎదుట గోచరించుచుండిన దుర్గమును ముట్టడించుటకు వలయు సన్నాహముల నొనరించెను. కాని, వారి యవస్థ కడు ప్రమాదకరముగ నుండెను. భయంకరముగ గోచరించుచుండిన వైరి దుర్గమును సాధించుటకు వారెట్టి ప్రయత్నము లొనరించినను, విఫలమగుచుండెను. ముందుగానుండిన ప్రదేశమంతయు నూబిగా నుండుటచేతను, ప్రాకారములపై నుండిన ఫిరంగులు నోరులు తెఱచికొని వీక్షించుచుండుటచేతను, సమీపించుటకు వీలులేకుండెను. కాశిము యొక్క దళము లప్పుడప్పుడు ఆకస్మికముగా పైబడి బాధించుచుండుటచే, నాంగ్లేయుల యవస్థ దుర్భరముగ నుండెను. అట్టి ప్రదేశమున దీర్ఘముగా నిలిచినను, నిలువఁజాలక వెన్నిచ్చినను, అపాయము తప్పక సంభవించును. కాని, అదృష్టవశమున నొక్క వైపరీత్యము సంభవించుటచే, కాశిము యొక్క మహాప్రయత్నమంతయు భగ్నమాయెను.

ఏకారణముచేతనో, కంపెనీ సైనికుఁడొకఁడు పాఱివచ్చి, కాశి

ముయొక్క సైన్యమున బ్రవేశించియుండెను. ఆతని సైనికులెల్లరు స్వామిభక్తిపరాయణులై, కడు జాగరూకతతో దుర్గమును రక్షించుచుండ, ఈ నరాధముఁడు సెప్టెంబరు నాల్గవ తారీఖు నిశీథసమయమున దన యనుచరుల కండ్లు గప్పి, కంపెనీసైన్యము సమీపించి, అభేద్యముగ నుండిన దుర్గమున జొరఁబడు మార్గము దాను జూపింతునని వారికిఁ దెలియఁబఱచెను. తోడనే, కాల్సేతు లాడక డిల్లవడి యుండిన యాంగ్లసైన్యాధిపతి, పెన్నిధిగాంచిన పేదవలె, పరమానందభరితుఁడై, వలయు సన్నాహము లొనరించి, ఒక సైన్యవిభాగము నా ముచ్చుతో బంపి, ఇతర సైన్యవిభాగములను సముచిత స్థలములయందు సముచితముగా నిలిపి యుంచెను.

ఒక్క నీచుని కారణమున నెట్టి మహోపద్రవము సంభవించును! ఆ పాపాత్ముఁడట్టి ఘోరకృత్యము నొనరించునని యెఱుంగఁజాలని కాశింయొక్క సైనికు లేమరి యుండ, కంపెనీసైనికులు భద్రముగా బ్రవేశించిరి. వారిని గాంచినంతనే జెండాడుటకు మాఱుగ, దుర్గమును రక్షించు సైనికులు కలవరపడి యిటునటు దిరుగాడ నారంభించిరి. తోడనే, కంపెనీ యితర సైన్యవిభాగములు కూడ సాయుధులై జొరఁబడెను. ఆంగ్లసైనికులను గాంచినంతనే యుదయించిన కలవరము, వెంటనే సహస్రాధిక మాయెను. తోడనే, ఆ దుర్గరాజ మాంగ్లేయుల వశమాయెను.

ఆంగ్లేయుల గుణదోషములను మీర్ కాశిం యొక్కఁడే చక్కగ గుర్తించి యుండెను. మితిలేని వారి ధనతృష్ణను, హేయమగు వారి స్వార్థపరత్వమును, పాపభూయిష్ఠమగు వారి నిరంకుశ ప్రవర్తనమును గూడ నాతఁడు పూర్తిగ చవిచూచి యుండెను. వారి వలన దేశీయ నృపాలురకు రానుండిన విపత్తుగూడ నాతఁడు చక్కగ గుర్తించియుండెను. సైన్యవ్యవస్థలయందుగూడ నత్యంతానుభ



వముగల మహావీరుఁడగుటచే, నతి భయంకరముగఁ జెలరేగుచుండిన ఆంగ్లేయ మహాప్రవాహమును అరికట్టుట కాతఁడొక్కఁడే చాలియుండెను. కాని, ఒక్కొక్క సమయమున, నొక్కొక్క తెఱంగున, పరిస్థితులు విషమించుచుండుటచే, నా మహనీయుని ప్రయత్నము లన్నియు నిరర్థకము లాయెను. బంగాళాదేశ స్వాతంత్ర్యము నిలుప గడంగిన యమ్మహామాని, పైనుదహరించిన తెఱంగున, భగ్నమనోరథుఁడాయెను. తుదకాతఁడు నిజదేశమున నిలుచుటకైనను వీలు లేకపోయెను.

3574

అంతకు బూర్వమే, అయోధ్యదేశాధిపతియగు సుజాఉద్దౌలాతో నాతఁడొక సంధి గావించి యుండెను. బంగాళాదేశమునఁ జొరఁబడి, ధనాధికారములను జిక్కించుకొని, దురాగతముల నొనరించుచుండిన ఆంగ్లేయులకు బుద్ధి చెప్పినగాని, వారింకను జెలరేగుదురని యెంచి, కాశిమునకు సాహాయ్య మొనరించుట కాతఁడు సంసిద్ధుఁడాయెను. అయోధ్యాధీశుని మఱపించియు, వెఱపించియు, విడదీయవలయునని ఆంగ్లకంపెనీసేవకు లెంత ప్రయత్నించినను, ఆతఁడు చలింపలేదు. ఆసమయమున ఢిల్లీశ్వరుఁడుకూడ నచటనేయుండెను. ఆతఁడుకూడ నాంగ్లేయులను శిక్షించుటయందలి యావశ్యకతను గుర్తించినవాఁడై, అయోధ్యదేశాధిపతితోఁబాటు తానుగూడ మీర్ కాశిమునకు సాహాయ్యమొసంగుట కిచ్చగించెను.

అట్లు వారందఱు నేకమగుటచే, నాంగ్లేయుల స్థితి కడు ప్రమాదకరముగ నుండెనని వేఱుగఁ జెప్పనక్కరలేదు. మఱియు, మీర్ కాశిము బంగాళాదేశమున నిలుచుటకైన నవకాశ మొసంగక, ఆతని బాఱద్రోలిన యోధాగ్రేసరుఁడగు 'ఆడమ్సు' మరణించియుండెను. ఆతని యనంతరము సైన్యాధిపత్యము వహించిన వారలు దుర్బలులును, జడస్వభావులును నై యుండిరి. మఱియు, తన

సైనికులు ప్రాణములపై నాసవదలి, ధైర్యముగ బోరాడి, తనకు మహావిజయము సముపార్జించుటచే, వారికి బహుమానముల నొసంగుదునని మీర్జాఫరు బాసచేసియుండెను. కాని, కలకత్తాయందలి కంపెనీ సంఘసభ్యులు కేవలము స్వార్థపరులై యుండుటచే, దాత సిద్ధముగా నుండినను, సైనికులకు ముట్టవలసిన బహుమానములు ముట్టలేదు.* ఆకారణమున నాసైనికులు విముఖులై, కడు కుపితులై, తిరుగుబాటు సలుప నారంభించిరి. ప్రత్యేక సమర్థులును, విశేషసైన్య సమన్వితులును నగు మహమ్మదీయ మిత్రులు విజయలక్ష్మిని వడయుట కట్టి పరిస్థితులు మిక్కిలి యనుకూలముగ నుండెను.

కాని, మొగలాయి సార్వభౌముఁడు చాల బలహీనుఁడై యుండెను. అయోధ్యాదేశాధిపతిపై నాతఁడు పూర్తిగ నాధారపడియుండెను. సామ్రాజ్యపదభ్రష్టుఁడై యరుదెంచిన యా పాదుషా ఆంగ్లేయుల సఖ్యము గూడ కోరుచుండెను. మఱియు, నతిశీఘ్రముగ నాంగ్లేయుల వలన రానుండిన మహోపద్రవమును సుజాఉద్దౌలా—అయోధ్యాదేశాధిపతి—కూడ పూర్తిగ గుర్తించినట్లు కానరాదు. ఆంగ్లేయుల దుష్ప్రవర్తనము నొక్కపుడు నిరసించుచు, మఱియొక్కపుడు వారి నెయ్యమునే యాతఁ డపేక్షించుచుండెను. మఱియు, వైరులగు నాంగ్లేయులను శిక్షించి, శరణాగతుఁడగు మీర్ కాశిమును నుద్ధరించుటకంటె, తన రాజ్యమున కంటియుండిన బీహారు దేశమును నాక్రమించుటకే యాతఁడు రణరంగము ప్రవేశించినట్లు కాన్పించును. ఐనను, వలయు సన్నాహములను సము

* "Mir Jafar was ready enough to pay it, but his finances were under the virtual control of the Calcutta Council, and its members, always ready to help themselves, closed their ears to the just demands of their soldiers," Malleson,—P. 174.



చితముగా నొనరించుకొని, యాతఁడు యుద్ధసన్నద్ధుఁడాయెను.

ఈలోపున, ప్రసిద్ధిగాంచిన 'హెక్టరు మన్రో' యను నాతఁడు కంపెనీ తరఫున సైన్యాధిపత్యము వహించెను. ఆతఁడు బహుసమర్థుఁడును దయారహితుఁడగు శిక్షకుఁడును నగుటచే, సైన్యమున నుద్భవించిన తిరుగుబాటును కఠినముగ నణచివైచి, వలయు విధంబున సంస్కరించి, యుద్ధసన్నద్ధుఁడై బయల్వెడలి, 1764 అక్టోబరు 22వ తారీఖున, ప్రసిద్ధిగాంచిన 'బక్సారు' యను గ్రామము సమీపించెను. తోడనే, ఉచితమగు ప్రదేశము నొండు వెదకి, తమ సైన్యవిభాగములను సరిగా నవరించుకొని, యప్రమత్తులై వారు విడిసి యుండిరి. వారి యెడమవైపున గంగానదియు, వెనుకదెస బక్సారు గ్రామమును, అందలి దుర్గమును నుండెను.

సుజాఉద్దౌలాకూడ సర్వసన్నాహంబు లొనరించుకొని, బక్సారు సమీపించి, బలమగు ప్రదేశము నొండు వెదకి, యద్దానిని మఱింత బలపఱచి, శత్రుజన దుస్సాధ్యంబుగ నొనరించి, విడిసి యుండెను.

నలుబదివేల సైన్యమున కధినాథుఁడై, మిక్కిలి బలమగు ప్రదేశము నాక్రమించి, చక్కని వ్యూహము పన్ని విడిసి యుండిన అయోధ్యాదేశాధిపతిని సమీపించి, భంగపఱచుట యసాధ్యమని గుర్తించి, ఆంగ్లసైన్యాధిపతి యాలోచనా తత్పరుఁడై, నిశాసమయమున వైరిపైఁబడవలయునని నిశ్చయించుకొని యుండెను. కాని, అట్లు తటస్థము కాలేదు.

సూర్యోదయమైనంతనే, సుజాఉద్దౌలాయొక్క సైన్యములు శ్రేణులు గట్టుకొని, ధరణి వడంకునట్లు బయల్వెడలి, ఆంగ్లేయ సైన్యమును సమీపించెను. అచటి భూభాగమును బరిశీలించి, యనుకూలమగు ప్రదేశమున చక్కని వ్యూహమును బన్నుకొని వా

రు యుద్ధాభిముఖులై యుండిరి. ఎడమవైపున గంగానది వఱకు వ్యాపించి, బక్సారు దుర్గము నాక్రమించియుండిన సైన్యవిభాగమునకు 'బెహ్నా బహదూరు' యనువాఁడు యధినాథుఁడై యుండెను. ఆ సమీపముననే, కొంత కాల్బలముతోడను, చక్కని యాశ్విక దళముతోడను, 'గులామ్‌ఖాదర్' యను సైన్యాధిపతి యుండెను. 'సమ్రూ', 'మాడక్' యను పాశ్చాత్యసైన్యాధిపతులు తమ సుశిక్షిత పటాలములతోడను, ఎనిమిది క్షేత్రఫిరంగులతోడను మధ్యభాగమున నుండిరి. వారికి సాహాయ్యకరముగ, షూజా కులీఖాన్ యను వాఁడు ఆరువేల యాశ్విక కాల్బలములతో నుండెను. పాశ్చాత్యసైన్యాధిపతుల పటాలముల కిరువైపుల భయంకరములగు శతఘ్నులమరి యుండెను. కాశీరాజుయొక్క సైన్యము, రోహిల్లా సైన్యములు, ప్రసిద్ధిగాంచిన ఆఫ్ఘను యాశ్వికదళమును దక్షిణభాగమున నుండెను. కొంత యాశ్విక దళము ప్రత్యేకముగా వెనుకనుండెను. అట్టి వివిధ సన్నాహము లొనరించి సర్వసైన్యాధిపత్యము తానే వహించి, సుజా ఉద్‌దౌలా దక్షిణభాగముననే యుండెను.

ఆంగ్లసైన్యమధ్యభాగమున నేడు సోల్జరు పటాలము లుండెను. వారి కిరువైపులను రెండు సిఫాయిదళములుండెను. ఆయా సైన్యవిభాగముల నందున ఫిరంగులమరి యుండెను. ఈ పాశ్చాత్యహైందవ పటాలములకు రెండువైపులనుగూడ దృఢమగు ఫిరంగులు భద్రపరుపబడియుండెను. వారివెనుక, రెండవపంక్తి యేర్పడి యుండెను. ఒక పాశ్చాత్యపటాలము మధ్యభాగమునను, దాని కిరువైపుల సిఫాయిదళములును, వారి నడుమ ఫిరంగులును నమరియుండెను. ఆశ్వికదళముకూడ నచటనే యుండెను. అందు మొదటి శ్రేణికి ప్రాపుగా నొక భాగమును, వారి సామగ్రిని రక్షించుట కొక భాగమును సముచితముగా విభజింపఁబడి యమరియుండెను. వారి సైన్య



మంతయు మొత్తముమీఁద ఏడువేలు పైగా నుండెను. ఆంగ్లేయ సైన్యముయొక్క మొదటి శ్రేణికి నెడవవైపునను, ముందుగను విశాలమగు నూబి ప్రదేశముండెను. ఆపై నొక గ్రామముండెను. కుడిభాగమునకు ముందుగా నొక విశాలమగు తోట యుండెను. ఆ గ్రామమునకును, ఆ తోటకును మధ్యగా నుండిన ప్రదేశమంతయు సమముగా నుండెను. ఆతోటకు కుడివైపున మఱియొక గ్రామముండెను. ఆ గ్రామములను, ఆ తోటనుగూడ సుజాఉద్‌దౌలా యొక్క సైన్యము ఆక్రమించుకొని యుండెను.

ఇట్లు, ఇరు తెఱఁగులవారును సర్వసన్నాహముల నొనరించుకొని, పరస్పర వినాశము దలపెట్టి, సమరోత్సాహపూరితులై, నిరీక్షించుచుండిరి. సైన్యాధిపతు లిర్వురు ననుభవజ్ఞులును, కార్యదీక్షాపరతంత్రులునై యుండిరి. అపజయము వలన గలుగు మహా సంకటమును గుర్తించిన వారలగుటచే, వార లిర్వురు జయింపవలయుననియే కృత నిశ్చయులై యుండిరి.

సుమారు, తొమ్మిదిగంటలకు యుద్ధము ప్రారంభమాయెను. శత్రుసైన్యమును సూక్ష్మముగా బరిశీలించి, తన సైన్య విభాగమును ముందుకు నడపించి, శత్రుసైన్యమధ్యభాగమును గుఱిచూచి, తన ఫిరంగులను సుజాఉద్‌దౌలా మ్రోగించెను. అచటి యాంగ్ల ఫిరంగులంత దూరము బోజాలని కారణమున, వారు ప్రత్యుత్తర మొసంగ నేరక పోయిరి. వారి యవస్థ బరికించి, ఆంగ్లసైన్యాధిపతి ఆ సైన్యవిభాగమును ముందుకు ద్రోయగడంగెను. కాని, ఊబిప్రదేశము వారి కడ్డుగానుండెగదా. శత్రువుల ఫిరంగులకు గుఱియై, ఆ యూబి ప్రదేశమును చుట్టి ముందుకేగుట మిగుల కష్టముగ నుండినను, కృతకృత్యులై, వారుకూడ తమ ఫిరంగులను బ్రయోగించిరి. వారట్లు ఫిరంగులను మ్రోగించుచు, శ్రేణులు గట్టుకొని, ముం

దుకు సాగుచుండ నొక యపాయము సంభవించెను. అంతలో, ఆ ఘనురౌతులు పరుగుపరుగున పఱతెంచి, ఆంగ్ల వామభాగమును ఛేదింపఁగడంగి, భగ్నమనోరథులై, తిర్పునదిరిగి, ఆంగ్లేయుల సామగ్రిని రక్షించుచుండిన సైన్యముపై బడి చెండాడి, ఆ సామగ్రిని పూర్తిగా వశపఱచికొనిరి.

గులామ్‌ఖాడర్ యొక్క యాశ్విక దళము కూడ నాఘనులకు తోడ్పడియుండెను. అట్లు విజయులై నంతనే, వారు ద్విగుణీకృతోత్సాహముతో శరవేగమున బోయి, ఆంగ్లేయుల వెనుక శ్రేణిపై పిడుగువలె బడిరి. ఆంగ్లేయు లత్యంత పరాక్రమము బ్రదర్శించిరి. అత్యంతోత్సాహముతో నాశ్విక దళమును నడపించుచుండిన మహమ్మదీయ నాయకుఁడు నిహతుఁడాయెను. ఐనను, వారి యుత్సాహము తరుగకుండెను.

శత్రుసంహార మొనరించుటకై, నబాబు—సుజాఉద్దౌలా—యొక్క కాల్బలముకూడ తీవ్రప్రయత్నము లొనరింపఁగడంగెను. ఆంగ్లేయ శ్రేణి దక్షిణభాగమున కంటియుండిన గ్రామమునకు దృఢతమంబులగు తన ఫిరంగులను నబాబు నడిపించి, శత్రుసైన్యముపై బ్రయోగించెను. తోడనే, అయ్యాంగ్ల సైన్యభాగము చలించెను. సహస్రనయనములతో బరీక్షించుచుండిన ఆంగ్లసైన్యాధిపతి ఆ విషయమును గమనించి, అందువలన గలుగు యుపద్రవమును గుర్తించి, ఆ గ్రామముపై నొక సిపాయి దళమును బంపెను. ఆ సిపాయిలు వేఱొక మార్గము ననుసరించి, శర వేగమున బోయి, కరవాలముల బూని, హఠాత్తుగ వైరిపై లంఘించి, వారిని గలవరపఱచి, ఆ గ్రామము నాక్రమించిరి. అచటి తోటనుగూడ నాక్రమింపవలయునని యాసించి, ఆంగ్లసైన్యాధిపతి మఱియొక సిపాయిదళమును బంపెను. కాని, అంతలో, మహమ్మదీయులు సద్దు



కొని, ధైర్యము వహించి, దృఢమనస్కులై, ఏతెంచిన వైరిని దాకి, పూర్తిగ భంగపఱచి పాఱఁదోలిరి.

వార లట్లు ధైర్యమువహించి, ఆతోటయందే నిలిచియుందురేని, నబాబు విజయుఁడగుట తథ్యము. ఆతని యాశ్వికదళము ఆంగ్లేయుల రెండవశ్రేణిని చిందరవందర జేయుచుండెను. ఆతని పాశ్చాత్యసైన్యాధిపతులు మధ్యభాగమున హోరాహోరి పోరాడుచుండిరి. నబాబుయొక్క సైన్యాధిపత్యముక్రింద నుండిన దక్షిణభాగము, ఇంచుకేని చలింపక, ధైర్యముగా బోరాడుచుండెను. అట్టి సమయమున, నా తోటలోనున్న సైన్యవిభాగము కూడ, సమీపింపనుండిన శత్రుసైన్యమును జేరనీక, సమాన ధైర్యముతో బోరాడుదురేని, నబాబునకు విజయము చేకూఱుట నిక్కువము.

అనుభవజ్ఞుఁడగు నాంగ్లసైన్యాధిపడి ఆతోటయొక్క ప్రాముఖ్యతను జక్కఁగ గుర్తించియుండెను. తానాప్రదేశము నాక్రమించినగాని తాను విజయుఁడగుట యసంభవమని యాతఁడు గ్రహింపఁగలిగెను. ఎట్టులైనను శత్రుసైన్యము నాప్రదేశమునుండి బాఱదోలినగాని, రణరంగమున దాను నిలుచుట కల్లయని యాతఁడెఱింగియుండెను. కావున, ఆవైపుననే తన దృష్టి కేంద్రీకరించి, తన సైన్యవిభాగము నంతయు నటు పంపెను. తోడనే, రెండుసైన్యములును యుద్ధమునకు డీకొనెను. యుద్ధమతితీవ్రముగను, అతి తీక్ష్ణముగను, అతి దారుణముగను క్రమముగా బరిణమించెను. హైందవ స్వాతంత్ర్యము నిలుప గడంగిన అయోధ్యాధిపతికిని, హైందవ స్వాతంత్ర్యమును హరించుచుండిన ఆంగ్లేయులకును జరుగుచుండిన సంగ్రామముయొక్క జయాపజయములు నిర్ణయించు మహాముహూర్త మేతెంచియుండెను. కాని, హైందవస్వాతంత్ర్యాంత

ము సమీపించుటచే, మహమ్మదీయులు వెనుకకు తగ్గిరి; ఆంగ్లేయులాతోట నాక్రమించిరి.

ఆంగ్లేయుల యవస్థ కొంత సుకరముగ నుండినను, జయాపజయము లింకను ననుమానముగనే యుండెను. తోటలోనుండి మఱలిన మహమ్మదీయ సైన్యము వెంటనే శ్రేణులు గట్టుకొని, అచలాకృతి దాల్చెను. ఇంకను నబాబు విజయుఁడగు నవకాశ ముండెను. కాని, ఆతని సైనికులు ప్రాణములపై నాసవదలి, ధైర్యోత్సాహములు వహించి, వైరితో హోరాహోరి పోరాడుచుండ, హఠాత్తుగ నొక్క గొప్పప్రమాదము సంభవించెను.

నబాబుయొక్క పాశ్చాత్య సైన్యాధిపతులకు 'కూలీఖాను'యనువాఁడు ప్రభుగానుండెగదా! ఆతోటలో జరుగుచుండిన సంకుల సమరమును దూరమునుండియే గాంచి, దిక్కులు పిక్కటిల్లునట్లు గర్జించుచుండిన ఫిరంగుల భూరిధ్వానంబుల నాలించి, యుక్తాయుక్తములను విచారింపక, తనవారలు జయించిరనియే నిశ్చయించి, వైరిని సంపూర్ణముగా భంగపఱచి మహావిజయము వడయుట కియ్యదే తరుణమని యెంచి, తన యభిప్రాయము నెవ్వరికీ నెఱింగింపక, నిజసైన్యసమేతుఁడై యెదుట నుండిన యాంబి ప్రదేశమును ఱివ్వున జుట్టి, వైరిపై లంఘించి, అతి తీవ్రముగ బోరాడి, గోడవలెనుండిన యాంగ్లసైన్యమును ఛేదింపఁజాలక మరణించెను. ఆతఁడొనరించిన మహాపరాధము ఆతని మరణముతో దీఱునదికాదు. జయింపఁజాలిన సుజాఉద్దౌలా పరాజితుఁడగుటకు గూడ నయ్యదే కారణభూతమాయెను.

అతి సాహస మొనరించిన యా సైన్యాధిపతి అట్లు మరణింపగనే, ఆతని సైన్యవిభాగమంతయు రయమున వెనుకకు మఱలి పో



యెను. తోడనే, ఆంగ్లేయులు సింహనాదము లొనరించి, పగతుర వెన్నాడ గడంగిరి.

కూలీఖాను కారణమున నట్టి ఘోరము సంభవించినను, వీరాగ్రేసరుఁడగు సుజాఉద్దౌలా చలింపలేదు. చెదరిన శ్రేణుల నాతఁడు సరిజేసికొని, మఱల వైరిని దాక వలయునని యెంచి, తీవ్రతర ప్రయత్నము లొనరింప గడంగెను. ఝరీ ప్రవాహమువలె నరుదెంచుచుండిన వైరిని పరాభవించుట యసంభవమైనను, వారిని వారించి, యుద్ధరంగమునుండి క్షేమముగా మఱలుటకు నైన నవకాశ ముండెను. అట్టి సమయమున, పిడుగువంటి ప్రమాదము వేఱొకటి దాపరించెను.

'బెహానీబహదూరు' యను సైన్యాధిపతి బక్సారు గ్రామమును, అందలి దుర్గమును నాక్రమించి యుండెను. ఆతఁడు దూరమున నుండుటచే, యుద్ధరంగమున నేమిజరుగుచుండెనో స్పష్టముగ నాతనికి తెలియకుండెను. కూలిఖాను యొక్క తీవ్రపాటుచే నబాబునకు సంభవించిన యుపద్రవము గూడ నాతఁడెఱుంగఁజాలక పోయెను. ఎఱుంగనివాఁడు యప్రమత్తుఁడై యుండుటకు మాఱు నబాబు విజయుఁడాయెననియే దృఢముగ విశ్వసించి, గర్వించి, నిర్విచారముగ నేమరియుండెను. ఆతని సైనికులు కూడ శ్రేణులు వీడి, ఇటునటు దిరుగుచు, రానుండిన మహోపద్రవము నెఱుంగని మూఢాత్ములై హాయిగనుండ, నాంగ్లసైన్యము హఠాత్తుగ గోచరించెను. తోడనే, నబాబుయొక్క సైనికులు భయవిహ్వలులై పలాయన మొనరించిరి. యుద్ధరంగమునందంతటను హాహాకారములు జనించెను. అంతవఱకును ధైర్యముగా నిలిచియుండిన నబాబు కూడ రయంబున దొలంగవలసినవాఁడాయెను.

బక్సారు యుద్ధము జరిగిన మఱుచటి యుదయముననే, ఢిల్లీసార్వభౌముఁడు ఆంగ్లేయుల నెయ్యమపేక్షించి వారి పంచజేరెను. తోడనే, అయోధ్యదేశాధిపతియగు సుజాఉద్దౌలా కూడా నాంగ్లేయులతో సంధి గావించుకొనవలయునని ప్రయత్నించెను.

యుద్ధము ముగిసిన యుత్తరక్షణము నుండియు, నాంగ్లేయులు ధనముకై మీర్జాఫరును బాధింప దొడంగిరి. అతి సారవంతములగు బర్ద్వాను, మిడ్నాపూరు, చిట్టగాంగు జిల్లాలను ఆంగ్లేయుల కొసంగి, ఉపరి వారికి నెలవక్కంటికై దులక్షల పైకమును గూడ సమర్పింపవలసినవాఁడగుటచే నబాబునకు సగము రాఁబడి నష్టమాయెనని చరిత్రకారుఁడగు 'మిల్లు' వ్రాసి యున్నాఁడు. మిగిలిన సగము పైకము మాత్ర మాతనికి దక్కియుండెనా? విరాళములు, బహుమానములు, అను నెపమున దోపిడిచేయు నాంగ్లకంపెనీ సేవకులకు కోరునంతనే ధనము చెల్లింప వలసిన షరాబువలె మీర్జాఫరుండెను. * హేయమగు నాంగ్లకంపెనీసేవకుల స్వాంతవ్యాపారముచే నబాబుయొక్క ఆర్థికస్థితి మఱింత నికృష్టమాయెను. కంపెనీసేవకుల దుష్ప్రవర్తనముచే దేశీయ పరిశ్రమలన్నియు నశింపనారంభించెను. అట్టి సందర్భమున, అంతులేని ఆంగ్లకంపెనీసేవకుల ధనతృష్ణను నబాబు యెట్లు తీర్పఁగలఁడు? వయోవృద్ధుఁడై, దుర్బలుఁడై యుండిన మీర్జాఫరు, ఆంగ్లకంపెనీసేవకుల యొత్తిడి కడుంగడు దుర్భముగ నుండుటచే, శీఘ్రతరముగ మరణించెను.

* Cf.— "By the revenues of the three ceded districts, added to the monhtly payment for the war, "the Company" we are informed by Clive, "became possessed of one half of the Nabob's revenues. He was allowed, says that great informant, "to collect the other half for himself; but in fact he was no more than a banker for the Company's servants, who could draw upon him" (meaning for presents) "as often, and to as great an amount as they pleased....... The importunities to which he was subjected only conspired, with the infirmities of age and of a body worn out with pleasure, to hurry him to his grave."

Mill, Vol, III—p, 355, 6.



ఆతఁడు మరణించినను ఆతని జీవిత వృత్తాంతము మాత్రము ఆంగ్లేయులు హిందూదేశమును జయించిన యద్భుత విషయమును వ్యక్తీకరించు గుణపాఠమువలె శాశ్వతముగ చరిత్రయందు నిలిచియుండును.

మీర్జాఫరు మరణించినంతనే, మఱియొకని నాసింహాసనముపై నిలుపుట యవసరమాయెను. రూపు రేఖావిలాసములు లేని యొక శిలాభాగమున కెద్దియో పవిత్రనామ మొసంగి, యాడంబరముగా బ్రతిష్ఠించి, అల్పజ్ఞులగు జనులను మోసగించి ధనార్జన మొనరించు టక్కరి పూజారులవలె నాంగ్లేయులు మెలంగుచుండిన కారణమున, 'నబాబు' యొకఁడు వారికి గావలసి వచ్చెను. బంగాళా బీహారు ఒరిస్సాదేశముల రాజ్యాధిపత్యమును వారు బహిరంగముగ వహించినను వారిని అధిక్షేపించువారు యేరును లేరు. అట్లుగాక, విగ్రహము నొండు సింహాసనముపై నిలిపి, నిక్కంపు రాజ్యాధికారమును చేఁజిక్కించికొని, తమ దుర్వ్యాపారములను నిరంకుశముగ మఱికొంతకాలము సాగింప వలయుననియే వారు యోచించిరి. *

నబాబును తయారుచేయుటకంటె లాభకరమగు విషయము ఆంగ్లకంపెనీసేవకులకు వేఱొకటి లేదు గదా. కాని రాజ్యాధిపతిని నిర్ణయించుటలో వారు గమనింప వలసిన ముఖ్యాంశములు రెండుం

*Cf.— "But the modesty of the English, still alarmed at the thought of declaring themselves sovereigns of Bengal, grasped powerfully at the reality, though it desired to shun the appearance of power."

Mill, Vol. III, p. 358.

డెను. రాజ్యాధిపతి యగునంతనే యాతఁడాంగ్లకంపెనీ సేవకులపై ధనవృష్టి గురిపింప వలయును; ఆశాపరులగు నాంగ్లేయుల కెట్టి యడ్డంకియు గలిగింపక నబాబు జీవచ్ఛవంబువలె నుండవయును. వారి దృక్పథమున, నట్టివాఁడే రాజ్యార్హుఁడు. కాఁబట్టి, కంపెనీ సేవకులు దీర్ఘముగ విచారించి, మీరాన్ కుమారుని విసర్జించి, ఆతనిసోదరుఁడగు నజీముద్దౌలాను రాజ్యాధిపతి నొనరించిరి. ఆతడవు డిరువదియేండ్ల ప్రాయఁపువాఁడై యుండెను. ఆతనితో నాంగ్లేయు లెట్టి సంధిగావించి యుండిరో గమనింపవలసి యున్నది. ఆతని తండ్రియగు మీర్జాఫరు కావించియుండిన తొంటి యొడంబడిక ప్రథమమున ఖాయపఱుపఁబడెను. పై రాష్ట్రాధిపతుల వలన భయము లేకుండునట్లు దేశమును సంరక్షించు భారమంతయు దామే పూర్తిగ వహింతుమని ఆంగ్లేయులు తెలియఁబఱచిరి. రాజునకుగల హోదాను నిలిపికొనుటకును, న్యాయప్రదానమునకును, శిస్తులు వైగారాలను వసూలుచేయుటకును వలయు స్వల్పసైన్యమును మాత్రమే నబాబు గలిగియుండవలయునని వారు శాసించిరి. ఆకారణమున దమకగు నధికవ్యయమును నబాబే భరింప వలసిన వాఁడాయెను. సైన్యమంతయు నాంగ్లేయుల యధీనమున నుండుట చేతను, నబాబు నిజసైన్య సాహాయ్య విరహితుఁడై యుండుటచేతను, ఆతఁడు పూర్తిగ నాంగ్లేయులపై నాధారపడియుండ వలయును. వారలు యెట్టి దురాచారములకు గడంగినను, నబాబును నెట్లు బాధించినను, ఆతఁడు ప్రతీకారమొనరించుట కెట్టి యవకాశమైనను నుండదు. సైనికాధికారమే కాక, 'సివిల్' పరిపాలనమును గూడ వారు వశపఱచికొనిరి. తాము సిఫార్సుచేయు వానిని దివానుగా నబాబు పరిగ్రహింపవలయుననియు, అట్టి దివానునకు దన రాజ్యాధికారమునంతయు నప్పగింపవలయుననియు, అట్లు సర్వాధికారము వ



హించు దివానును తమ యనుమతిలేకుండ నబాబు తొలగింప రాదనియు గూడ నాంగ్లేయులు శాసించిరి. ఇంతకంటె క్రూరమగు షరతు వేఱొకటి యుండదు. అన్నిషరతులకంటె నబాబున కియ్యదే మిక్కిలి బాధకరమైనదని చరిత్రకారుఁడగు 'మిల్లు' వ్రాసియున్నాడు.*

ఈ షరతులనుబట్టి నబాబుయొక్క అవస్థ యెట్లుండునో పరిశీలింతము. మొదటనే, సగమురాజ్య మూడిపోయెను. మిక్కిలి కష్టముమీఁద వసూలగు ధనము ఆంగ్లేయులకు సమర్పించుటకే చాలకుండెను. సైనికాధికారమంతయు నాతఁడు కోల్పోవుటచే నాతఁడు పూర్తిగ నాంగ్లేయులపై నాధారపడియుండవలెను. తుదకు, 'సివిల్' యధికారమునుగూడ, నాంగ్లేయుల కిష్టుఁడగు, దివానున కప్పగింపవలసిన వాఁడగుటచే, నట్టి నబాబునకును, ఒక మట్టి విగ్రహమునకును, నెట్టి భేదమైన నుండదని స్పష్టమగును.

బంగాళాదేశమును నిరంకుశముగా బరిపాలింపవలసిన నబాబులు యీ తెఱంగున సంపూర్ణముగా స్వాతంత్ర్యవిరహితులై పోయిరి.

## IV 'దివానీ'

ఆంగ్లకంపెనీసేవకుల ప్రవర్తనము హైందవుల కెట్లు దుర్భరముగ నుండెనో, ఎంత దుస్సహముగ నుండెనో పాఠకులు గ్రహించియున్నారు. హిందూదేశస్థులకే గాక, ఇంగ్లాండుదేశస్థులకు స

* Cf.—"The Nabob suffered more in submitting to this condition than to all the rest."

Mill, Vol, III, p, 359.

హితము తమ సేవకుల ప్రవర్తనము కడుంగడు దుర్భరమాయెను. కారణములు మాత్రము వేఱుగ నుండెను. అయ్యవి గమనింపఁదగియున్నవి.

ప్లాసీయుద్ధము జరిగినది మొదలు, ఇంగ్లాండునందలి యాంగ్ల సంఘమునందు నద్భుతమగు క్రొత్తసంచలన ముదయించెను. కాసైనను వెలలేని జనులు హిందూదేశమున గొలఁదికాలముండి, లక్షాధికారులై, ఇంగ్లాండుదేశమునకు బోవుచుండిరి. అట్టివారి రాక మొదట సంభ్రమమునకును, పిదప విస్మయమునకును తుదకు మత్సరమునకును గారణమాయెను. తోడనే, ఇంగ్లాండుదేశస్థుల ధనతృష్ణ హఠాత్తుగ, కడు తీక్ష్ణముగ, విజృంభించెను. తాము ధనికులమగు మార్గమును క్లయివు కనిపెట్టెనని యెంచి, వారాతని నభినందింపదొడంగిరి. ఆయాసపడు నవసరము లేక, ధనరాసులను వడయు మార్గము గోచరమాయెనని వారెంతయు సంతసించిరి. ఒక్కసారి హిందూదేశమున కేగినచో దారిద్ర్యవిచ్ఛిన్నమగునని యు, తాము శాశ్వతముగ భోగభాగ్యసమన్వితులై యుండనగునని యు భావించి వారానందపరవశులైరి. ధనాశాపీడితులైన ఆంగ్లేయులందఱును హిందూదేశమునకు బోవలయునని తత్తరపడసాగిరి. పరపతిచెడి దివాలా తీయువారును, అతి సాహసికులగు సైనికులును, లాభకరమగు జీవనోపాధి దొఱకదని వెఱచు సద్వంశజులగు 'నగస్త్యభ్రాతలు'ను "దమకేదైన నుద్యోగము నొసంగి పంపుఁడు", అని అచటి కంపెనీ సంఘాధికారులను బ్రార్థింపఁ గడంగిరి. తుదకు, ప్రాచ్యదేశ ధనాపహరణ మొక యంటురోగమువలె నింగ్లాండుదేశమున వ్యాపించెను.*

* Cf, Torren's "Empire ia Asia" p, 52,



నిఱుపేదలగు జనులు హిందూదేశమునుండి కుబేరులై ఇంగ్లాండుదేశమున కేతెంచుచుండిరి. వారి ధనము కష్టార్జితముకాక, అన్యాయార్జిత విత్తమైయుండుటచే, నద్దానిని విరివిగ వెచ్చించుచు, మహావైభవముతో వారు కాలము గడువ నారంభించిరి. వారి యైశ్వర్యమును గాంచి మత్సరపడువారును, వారి డాబుదర్పములను గాంచి యసహ్యపడువారును గూడ నయ్యాంగ్లకంపెనీ సేవకులను "నబాబులు" అని పరిహసింపదొడంగిరి.

హిందూదేశమునుండి ధనవంతులై స్వదేశమునకుఁ జేరువారిలో గొందఱు ఎంతద్రవ్యమైనను వెచ్చించుచు, 'పార్లమెంటు'లో జొరబడుచుండిరి. కొందఱు కంపెనీ "షేరులు" గొనుచుండిరి. మొత్తముమీద నెద్దియో తెఱంగున దమ యన్యాయార్జిత విత్తమును బ్రదర్శింపుచు నాంగ్లకంపెనీ సేవకులు ఆంగ్లప్రజాదృష్టి నాకర్షించుచుండిరి.

ఐనను, ఆంగ్లకంపెనీ సంఘాధికారు లాయా యత్యాచారములను సరకుఁజేయువారుకారు.* హైందవజనులను ఘోరముగ హింసించుచు, ధనసంగ్రహమొనరింప గడఁగిన కంపెనీసేవకులు కేవలము స్వార్థపరులైయుండిరి. మానవునకు సహజగుణములగు దయాదాక్షిణ్యములను, ధనాశాపరవశులై యుండుటచే వారు పూర్తిగ మఱచిపోయినట్టులే, కంపెనీయొక్క లాభక్షేమములను గూడ పూర్తిగ మఱచిపోయిరి. తమకు రావలసిన లాభములు సరిగా ముట్టకుండుటచే కంపెనీ డైరక్టరులును ప్రొప్రయిటరులును ఆగ్రహపరవశులైరి. అవుడు, తమసేవకులయొక్క అత్యాచారములను, దుర్వ్యాపారములును, క్రౌర్యప్రవర్తనమును, వారికి గోచర

* Cf, " They took no heed of the enormous perquisites often amassed by individual officials, so long as there was no public scandal".
V. A. Smith, p. 502.

ముకాఁజొచ్చెను. స్వంతవ్యాపారమొనరించి కుబేరులు కాఁగోరిన తమ కంపెనీసేవకులు ప్రదర్శించిన క్రౌర్యమునకు ఏ యుగమునందైనను, ఏదేశమునందైనను, సాటి యుండదని కంపెనీ డైరక్టర్లు అపుడు గుర్తించిరి.* అట్టి స్వంతవ్యాపారమునేగాక, బహుమానములను నెపమున నబాబులను పీడించి ధనార్జన మొనరించు దురాచారమును గూడ కంపెనీసేవకులు పూర్తిగ మానివేయవలయునని డైరక్టర్లు అపుడు శాసించిరి. బంగాళాదేశమున శాంతి నెలకొల్పుట ప్రధానకర్తవ్యమని వారికపుడు వ్యక్తమాయెను. బంగాళాదేశమున స్వైరవిహారమొనరించుచుండిన తమ సేవకులను కఠినముగ దండించినగాని దమ దుర్నయములను మానరనియు, వారి దుష్ప్రవర్తనము తుదముట్టినగాని దేశమున శాంతియు ప్రభుత్వమును నెలకొనవనియును, అటులైనగాని, తమ లాభములు సరిగానుండవనియును, ఇంగ్లాండునందలి కంపెనీ సంఘాధికారులు గ్రహించిరి.

అంతటి మహాత్కార్యభారమును వహింపఁజాలిన నాయకునికై వారు ప్రయత్నించిరి. కాని, ఆయుగమున క్లయివుకంటె సమర్థుఁడగు నాయకుఁడెవఁడు? దక్షిణహిందూదేశమున ఫ్రెంచివారు మహారాజ్యనిర్మాతలై, మహావైభవసమన్వితులై విరాజిల్లుచుండ నాంగ్లేయులు నిలుచుటకు నీడయైనను లేక తహతహ లాడుచుండిన సమయమున, వారిని క్లయివే యుద్ధరించెను. సురాజదౌలాకు వెఱచి, తమ సర్వస్వమును విడిచి, వందలై పాఱియుండిన ఆంగ్లేయులను క్లయివే యుద్ధరించెను. నబాబును దవ్వుఁ గాం

* Cf. "......We think the vast fortunes acquired in the inland trade have been obtained by a scene of the most tyrannic and oppressive conduct that ever was known in any age or country."
quoted by Mill—Vol. III, p. 390.



చునంతనే వంగివంగి జోహారులొనరించు నాంగ్లేయులను క్లయివే గర్వాధికారబలసమన్వితుల నొనరించెను. సకలజనభయంకరముగ శాసించు నబాబులను క్లయివే జీవచ్ఛవంబుల నొనరించెను. ఇంగ్లాండుదేశస్థు లనాయాసముగ ధనవంతులగు మర్మమునుగూడ క్లయివే కనిపెట్టియుండెను. అట్టి క్లయివు ప్రభువుతప్ప మఱి యెవ్వరు బంగాళాదేశమున శాంతి బ్రతిష్ఠింపఁగలరు? కాఁబట్టి, కంపెనీసంఘాధికారులచే నాతఁడు ప్రార్థితుండై, 1764 జూను మాసమున నింగ్లాండువీడి 1765 మేనెలలో కలకత్తానగరము జేరెను.

కార్యశూరుఁడగు క్లయివు యధికారము వహించినంతనే కంపెనీసేవకుల దురాచారముల నడంచుటకు వలయు తీవ్రప్రయత్నములొనరించెను. అమాయికులగు హైందవులను బిండి పీడించి ధనార్జన మొనరించు నాంగ్లసేవకులు సులభముగ లోఁబడువారు కారు. కాని, క్లయివు సమర్థుఁడును కార్యైకతత్పరుఁడును అగుటచే, నాతఁడు వలయు కాఠిన్యము వహించి, వారిని లోఁబఱచికొనఁగలిగెను. అనంతర మాతఁడు సైనికోద్యోగులనుగూడ లోఁబఱచికొనెను. అయ్యది మిక్కిలి కష్టతరముగనుండెను. ఆసందర్భమున నాతఁడు వ్యక్తపఱచిన కార్యదక్షతయు, కార్యైకతత్పరతయు, ధైర్యస్థైర్యములును వర్ణనాతీతములు.

అతిహేయమై, బంగాళాదేశస్థులకు ప్రాణసంకటమై యుండిన కంపెనీసేవకుల స్వంతవ్యాపారమును నిలిపివేయవలయునని కంపెనీడైరక్టర్లు ఆజ్ఞాపించియుండిరి. క్లయివు కొన్ని సంస్కరణములు ప్రవేశపెట్టి, శాంతి నెలకొల్ప గడంగెను. కాని, గర్హితమై యుండినను, మిక్కిలి లాభకరముగ నుండిన స్వంతవ్యాపారమును మా

తని మాతఁడు నిర్మూల మొనరింప లేదు.* ఎవనికి దోచునట్లు వాఁడు విచ్చలవిడిగ, నిరంకుశముగ, దోపిడిచేయు దురాచారమును మాత్ర మాతఁడు మాన్పెను. అట్లు సంస్కరించి, కంపెనీ సేవకులను సంఘోపసంఘములుగ విభజించి, శాసనసమ్మతముగ నాతఁడు వారిచే వ్యాపారము చేయింపదొడంగెను.† తనతోడి సేవకులు లాభములు గుడుచునపుడు తా నన్యథా ప్రవర్తించుట ధర్మము కాదని యెంచి, ఆమహనీయుఁడు కూడ నందు బాల్గొనెను. లాభమంతయు 35 వాటాలుగ విభజింపఁబడెను. వారివారి తాహతుల ననుసరించి, కంపెనీసేవకులందఱు పంచుకొనిరి. అందు, క్లయివునకు 5 వాటాలు ప్రత్యేకింపఁబడెను. ఈ వ్యాపారమువలన నాతని కెంత లాభము లభించియుండెనో తెలియదుగాని, 1767 లో తన వాటాల నాతఁడు సుమారు 3,20,000 రూపాయిలకు విక్రయింపఁ

* Cf. "......the trade itself had been lucrative to Englishmen in Bengal, and Lord Clive would not give it up."
R. C. Dutt's Economic history. p. 40.

† అక్టోబరు 17వ తారీకున, కంపెనీసేవకులు స్వంతవ్యాపారము నొనరించు దురభ్యాసమును వెంటనే విసర్జింపవలయుననియెడు కంపెనీడైరక్టర్ల ఆజ్ఞను గుఱించి తన యనుచరులతో క్లయివు విచారించెను. లాభకరముగ నుండు వ్యాపారములను మాత్రము విసర్జింపరాదనియు; తమ యజమానుల యాజ్ఞను మన్నించునట్లు మెలంగుటకై. లాభములేని వ్యాపారములను విసర్జింపవలయుననియును వారునిశ్చయించిరి.* లాభము నంతయు తామేదిగమ్రింగినచో, కంపెనీయధికారులు సహింపఁజాలరని యెంచి, తమలాభములో సాలుకు సుమారు 10,00,000 రూపాయిలు కంపెనీకి చెల్లింపవలయునని వారు తీర్మానించుకొనిరి.†

*" And it was resolved that all the branches of the trade, which it was worth while to carry on, should still be steadfastly retained; but that proper respect should be shown to the commands of their masters; and what was of no value to keep should be immediately and completely resigned. Mill, Vol, III—p. 410. † p. 413



గలిగెను.

ఆంగ్లేయులు బంగాళాదేశమును జయించిన కథ పూర్తి కావచ్చినది. ప్లాసీయుద్ధకారణమున ప్రారంభమైన ఈ విషాదోపాఖ్యానము బక్సారుయుద్ధకారణమున పూర్తియైనది.† దుర్బలుఁడగు మొగలాయి పాదుషాను పీడించి, బంగాళా బీహారు ఒరిస్సాదేశముల 'దివానీ' పదవిని బరిగ్రహించి క్లయివు ప్రభువు ప్రసిద్ధపురుషుఁడాయెను.

పాదుషాయును, అయోధ్యదేశాధిపతియును బక్సారు యుద్ధమున నోటువడి ఆంగ్లేయులతో సంధి గావించికొన నుండిరికదా. కాని, యుద్ధము ముగిసిన తోడనే, మీర్జాఫరును బిండి పీడించి ధనరాసులను రాఁబట్టు కార్యమున కంపెనీసేవకులు పూర్తిగ నిమగ్నులైరి. అచిరకాలమున వృద్ధుఁడును రోగపీడితుఁడును అగు మీర్జాఫరు ఆంగ్లదుర్భర పీడనము సహింపఁజాలక మరణించెను. తోడనే, నబాబును బ్రతిష్ఠించు మిక్కిలి లాభకరమగు మహాసమయము కంపెనీసేవకులకు దొరకెను. కాని, బహుమానముల నెపమున నబాబులను క్రూరముగ పీడించి ధనార్జన మొనరించు దురాచారమును విసర్జింపవలయునని కంపెనీడైరక్టర్లు కఠినముగ శా

* Cf.— Clive himself held five shares, which he sold in 1767 to his colleagues......for the considerable sum of £ 32,000.
V. A. Smith, p. 502.

† Cf.— "The victory," *i. e.* at Buxar, "which was absolutely decisive, completed the work of Plassey."
"The battle of Buxar in 1764 had closed the story of military-conquest of Bengal and Bihar, which from that date were substantially British territory, however the fact might be obscured by confused legal fictions concerning the Padshah of Delhi, the Subadar of Bengal, and other personages whose real position differed widely from that officially ascribed to them"
V, A. Smith, p. 501.

సించి యుండిరి. కాని, వారియాజ్ఞను మన్నింతురేని, ధనాశాపరవశులై యుండిన కంపెనీ సేవకులకు గొప్ప యాశాభంగము కలుగును. కాఁబట్టి, డైరక్టర్ల శాసనముల నుల్లంఘించి, తాము ప్రతిష్ఠించిన నబాబగు నజీమ్ ఉద్ దౌలాతో వారు హేయముగ నెట్టి యొడంబడికను గావించియుండిరో, ఒక్కొక్క కంపెనీసేవకుఁ డెంతెంత పైకమును వసూలుచేసియుండెనో వెనుకటి ప్రకరణమున వివరించి యుంటిమి.

ధనాశాపరులగు నాంగ్లసంఘసభ్యు లట్టి మహత్కార్యములలో నిమగ్నులై యుండుటచే, నయోధ్యదేశాధిపతియగు వజీరు మఱల యుద్ధసన్నద్ధుఁడగుటకు నవకాశము కలిగెను. నిజముగ సమయ మాతని కనుకూలముగనే యుండెను. కాని, హైందవప్రముఖులు కొందఱు ఆంగ్లేయులకు దోడ్పడుటచేతను, వారు సహజముగ బలవంతులును నిపుణులును అగుటచేతను రంగములందెల్లెడల నాంగ్లేయులే జయించుటచే, సంధికై వజీరు తత్తరపడెను.

ఓటువడిన అయోధ్యాధిపతి అలహాబాదు కోరా జిల్లాలను గోల్పోయెను. ఆతఁడు యుద్ధపుఖర్చులక్రింద నాంగ్లేయులకు 50 లక్షల రూపాయిలను సమర్పింపవలసిన వాఁడాయెను.

వజీరుతోడి వ్యవహార మాతెఱంగున తీఱినపిమ్మట, తనదృష్టి ఢిల్లీసార్వభౌమునిపై క్లయివు కేంద్రీకరించెను. ఆతఁడు సార్వభౌముఁడైన కారణమున, బంగాళాదేశపు నబాబు లాతనికి కప్పము చెల్లించుచుండిరి. కాని, కడపటి నబాబును ఆంగ్లేయు లన్యాయముగను పూర్తిగను అధికారవిరహితు నొనరించుటచే, కప్పము జెల్లించుటకు వారలే బాధ్యులైరి. ఆవిషయమున 30 లక్షలరూపాయిలు సార్వభౌమునకుఁ జెల్లవలసియుండెను. ఆంగ్లేయు లాపైకమును బూర్తిగ నెగవేసిరి. బంగాళాదేశపు కప్పముతోఁబాటు



5½ లక్షల సంవత్సరాదాయము గల జాగీరులను గూడ సార్వభౌముఁడు కలిగియుండెను. కాని, ఆతఁడు పరాజితుఁడైన కారణమున నా జాగీరులను గూడ గోల్పోయెను.

ఈ సందర్భమున జరిగిన ముఖ్యాంశ మొకటి యున్నది. దుర్బలుఁడును దురదృష్టవంతుఁడును అగు సార్వభౌముఁడు బంగాళా బీహారు ఒరిస్సాదేశముల 'దివానీ' పదవినిగూడ నాంగ్లేయులకు సమర్పింపవలసిన వాఁడాయెను అట్టి మహాత్యాగమొనరించిన సార్వభౌముని కండ్లు తుడుచుటకై, అయోధ్యాధిపతిని నిర్బంధించి సంగ్రహించిన అలహాబాదు కోరా జిల్లాల నాతనికి (సార్వభౌమునికి) క్లయివు యొసంగెను.†

'దివానీ' యనగా 'రివిన్యూ' వసూలు చేయు నధికారము. ఆంగ్లేయచరిత్రకారు లేలకో యీ 'దివానీ' యధికారకైంకర్య మొక మహావిషయమువలె నభివర్ణింతురు. ఆంగ్లకంపెనీసేవకు లంతకు పూర్వము 'దివానులు' కాకపోయినను అతిసాహసికులై యంతకంటె వేయిమడుంగులధికమగు నధికారమును జెలాయించుచుండిన విషయమును పాఠకులు గుర్తించియే యున్నారు. ఐదారుమాసములక్రిందటనే, బంగాళాదేశపు నబాబుతో వారు కావించియుండిన హేయమగు సంధిని గమనింతుమేని, నబాబు బోనులో బంధింపఁబడు మృగరాజువలె నుండెననియు, రాజ్యాధికారములన్నియు బూర్తిగ నాంగ్లేయుల హస్తగతమాయెననియు స్పష్టమగుచున్నది.* అధికారపగ్గములను చేజిక్కించికొనియుండిన కంపెనీకి ఈ

† సంవత్సరమున కిరువది యారు లక్షల రూపాయిలు కప్పము చెల్లించుటకు గూడ క్లయివు సమ్మతించెను.

* Cf.—"The theory that the cession of the Diwani or revenue administration to the company in 1765, left the Nawab in his full possession as Subahdar or Nizam has, therefore, to be counter-balanced by the very material consideration that the Treaty of

దివానీ యుద్యోగ మనవసరమై యుండుటయేగాక, దుర్భరమగు ద్వందప్రభుత్వమున కయ్యది మాతృకమై, అమాయకులును దురదృష్టవంతులును అగు బంగాళాదేశస్థు లెల్లరు పదిపదిహేను సంవత్సరముల కాలము వర్ణనాతీతమగు బాధల ననుభవించుటకు గారణభూతమాయెను.

దివానీయధికారము అనవసరమనుట తథ్యమే యైనను, ఆకారణమున నాంగ్లకంపెనీకి గలుగు లాభమును గమనింతము. పేరునకింకను ఢిల్లీశ్వరుఁడు సార్వభౌముఁడై యుండుటచే, నాతఁడు దయచేసిన 'దివానీ' యధికార ప్రభావముచే నాంగ్లకంపెనీకి నొకవిధమగు ప్రతిష్ఠాగౌరవము లలవడెను. తెలియనివారి కండ్లలో దుమ్ముకొట్టుటకీ దివానీ యధికారము మిక్కిలి యనుకూలముగ నుండెను. నిజామాధికారము నిజముగ నబాబునకే చెందియుండినను, ఆతఁడు దుర్భరాంగ్లపాశబద్ధుఁడై యుండుటచే, నాంగ్లేయులకుఁ గల యధికారమును నిర్ణయించుటకు వీలులేనిదియై యుండెను.

హైందవ రాష్ట్రములలో నెల్ల ధనవంతమగు బంగాళాదేశము, దివానీ యధికారప్రభావముచే, కంపెనీ యధీనమగుటయేగాక, ప్రభుత్వపరిపాలనాధికారములుగూడ పూర్తిగ వారి హస్తగతమాయెననియు, అట్టి విశేషాధికార సమన్వితులగు కంపెనీసేవకులు ప్రారంభదశయందు దురదృష్టవంతులగు దేశస్థుల యోగక్షేమము లరయకుండ కఠినముగను క్రూరముగను వ్యవహరించియుండిరనియు, దివానీయధికార కైంకర్యముచే నాంగ్లేయుల కెట్టి మహాలాభము

February, 1765, deprived the Nawab of any independent military or financial support for his executive."—
The fifth Report on the East Indian affairs—introduction, p. x.



లు చేకూరినను, దేశీయులకు మాత్ర మెట్టి లాభమైనను గలుగలేదనియును సర్ వాలంటైన్ చిరాలు వ్రాసియున్నాడు.*

* "The grant of Diwani to the company by the Titular Emperor of Delhi gave the company not only the wealth of Bengal, the richest province in India, but full rights of government and administration, which were at first ruthlessly exercised with little or no regard for the interests of the unfortunate population, who alone gained nothing by the change.'—
p. 70. 'India, Past and Present', Sir Valentine Chirol.

# శ్రీ శివాజీ విజయము.

ఇది యొక చరిత్రాత్మకమగు నాటకము.

కృతికర్త:—శ్రీయుత మొసలికంటి హనుమంతరావుగారు,

బి. ఏ. ఎల్, టి., విజయనగరము.

ఔరంగజేబుయొక్క సైన్యాధిపతులలో నొక్కఁడగు జయసింగుయొక్క వాక్కులను విశ్వసించి, ఆగ్రానగరమున కేగి, మొగలాయిదర్బారునం దెంతయు పరాభవింపబడి, తుదకు కారాగారబద్ధుఁడైన శ్రీ శివాజీమహారాజు ఔరంగజేబును వంచించి తప్పించుకొని, తనను వెన్నాడుచుండిన రాజభటుల ననేక తెఱంగుల కన్నుబ్రామి, తుదకు తన రాజ్యమును జేరుటయే యిందలి ప్రధానాంశము.

ఈక్రింద నుదహరించిన పద్యములవలన నాటకము యొక్క శైలి తెలియగలదు.

సీ. వస్త్రరత్నాన్నార్థ వరదానములచే జ
    గజ్జనులఁబ్రోచు కల్పశాఖి
  రఘువంశాది రాజ్యనీతతుల న
    పారంబుగాఁగన్న వీరమాత
  విజ్ఞానశూన్యతాపిహ్వాల పాశ్చాత్త్యు
    లకు విద్యనేర్పు కలాకలాప
  శంకర రామానుజాద్యాది మతధర్మ
    పోషకులనుగాంచు పుణ్యరాశి

అక్కటా! నేఁడుదిక్కరి యొక్కనింట
గడుపుకూటికి దాసియై బడుచునున్న
కష్టములఁబాప మగటిమి గలిఁగినట్టి
పుత్రుఁడొకఁడైన లేఁడయ్యె మిత్రులార!

(శివాజీ—ప్రథమాంకము.)

చ. ప్రకటసుగంధబంధుర మరంద మధువ్రత సంభృతాంబుజ
ప్రకరము లోకబంధుకరభంగి వికసమ్రిత వేచియుండునో
సకలబుధాళులార! తనజన్మదినోత్సవ కారణంబునన్
వికసితమూర్తియై విభుఁడు వేఁకనుదెంచుచు నుండెఁ గంటిరే.

(ద్వారపాలకుఁడు—ద్వితీయాంకము.)

శా. ఫుల్లాంభోరుహజాలసంభృతమహాంభోజాకరంబై రమా
వాల్లభ్యంబున సర్వలోకవినుత ప్రఖ్యాతిమైనుండి నేఁ
డెల్లన్ బోవఁగ దాసివై, పతితవై, హీనాత్మవై యుంటివో
తల్లీ! భారతరాజ్యలక్ష్మి! యెపుడీదాస్యంబు చల్లారునో.

(శివాజీ—తృతీయాంకము).

గీ. విపుల తాపత్రయాభీల వేదనలను
సముదితంబగు దుఃఖభారమున కోడి
పరితపించెడు మనుజుల బాధలెల్ల
నపనయింపవె యీ పవనాంకురములు.

(శివాజీ—పంచమాంకము).

వెల ... ... రు 0-12-0
మాచందాదారులకు ... 0- 8-0

---

మొసలికంటి సంజీవరావు,
సంపాదకుఁడు, ఆంధ్రసంజీవినీగ్రంథమాల, విశాఖపట్టణము.

## దేశీయ పరిశ్రమలను ప్రోత్సహింపుడు.

సరసమగు రేట్లు!  చక్కని పనితనము!

3576

మావద్ద అన్నివిధములైన పుస్తకములు, లెటరు పేపర్లు కార్డులు, కవర్లు, పట్టీపుస్తకములు, వీడ్కోలు పత్రములు శుభలేఖలు వగైరా అచ్చుపనులు సరసమగు ధరలకు సకాలములో చేసి యివ్వాబడును. రబ్బరు స్టాంపులు, లైన బ్లాకులు, హాఫ్‌టోన్ బ్లాకులు తయారుచేసి యివ్వాబడును

మా బైండింగు ఆఫీసులో లాబుక్కులు, రోజుము: ర్జులు, బైండుబుక్కులు, స్టూడెంటునోటుబుక్కులువగైరాల కోరిన రూలింగుతో సరసమగు ధరలకు తయారుచేసి యివ( బడును.

మావద్ద ప్రింటింగుపనులకు, ఉద్యోగస్థులకు విద్యార్థు లకు వలయు వివిధరకముల కాగితములు అన్ని సైజులలో విక్రయింపబడును.

మా షాపునందు అకౌంటుబుక్కులు, ఎక్సర్సై బుక్కులు, బైండుబుక్కులు, ఫైలుబుక్కులు. ఇండెక్సుల నవలలు, నాటకములు, శతకములు, నిఘంటువులు వగైర అమ్మబడును.

వివరములకు:—

## యన్. వెంకటేశ్వరరావు,

**ప్రొప్రయిటరు:— శ్రీ పద్మా అండ్ కంపెనీ,**

ప్రింటింగు ఏజంట్సు, బుక్ బైండర్సు, పేపర్ మర్చంట్సు అండ్ బుక్సెల్లర్సు

మెయిన్ రోడ్, బాపట్ల. (గుంటూరు జిల్లా)

